# అమరావతి

[Prescribed for the B. A. Classes by the Madras and Andhra Universities, 1963]


కొండూరు వీరరాఘవాచార్యులు

ప్రధానాంధ్రపండితుడు

శరభయ్యగుప్త హైందవోన్నత పాఠశాల



శిల్పకళాపరిషత్తు

సత్తెనపల్లి.

# అభిప్రాయాలు

“నవ్యాంధ్రసాహిత్య సంస్థానాస్థానంలో సరస్వతీ సింహాసనానికి సమీపంగా ఒక ప్రముఖస్థానం అలంకరింపతగ్గ శిల్పకావ్యం అమరావతి... విద్వత్సంస్తవనీయమైన యీయన కవితావేశానికి పూర్వసంస్కారంతో బాటు అభిజనగౌరవంకూడా ఒకమూలకారణమైంది. ఈయన ప్రత్యణువులోను వైదికశిల్పర్షి సంప్రదాయ ప్రభావం అనేకశః గోచరిస్తుంది.

అపరిమితమైన ఆంధ్రాభిమానమూ, అకలుషమైన బౌద్ధధర్మాసక్తీ, అభిజనపరంపరాగతమైన శిల్పకళాభిరతీ, అవేలమైన కవితావేశమూ, అనల్పములైన ఔచితీపాలనములతో అమరావతీ కావ్యరచన రమణీయంగా సాగింది. ప్రాచీనాంధ్రశిల్ప నాగరికతావైభవాన్ని ప్రదర్శించి ఆంధ్రహృదయాలను ఉత్తేజితములుగా చేసి స్వధర్మానుష్ఠానతత్పరములుగా చేయగల యీనవ్యకావ్యం కవిగారిసామర్థ్యమునకూ, వ్యుత్పత్తి వికసితమైన ప్రతిభకూ, విజయగీతములాలపిస్తూ సహృదయ హృదయాహ్లాదం కలిగిస్తున్నది.”

—కృష్ణాపత్రిక

“...ఆచార్యులవారు పండితులు. ప్రతిపద్యపాదమును ఈ విషయమును చాటి చెప్పును. వారిధార అమోఘము. అతిసరళము. ఏ పద్యము చదివినను ఇది భావప్రధానమా ? భాషాప్రధానమా ? అని తబ్బిబ్బుపడుదుము. ఉత్తమ కవిత్వమున కాయువుపట్టగు అకృత్రిమత్వమిందు వెల్లివిరిసి పాఠకుల నుఱ్ఱూతలూపుచున్నది. “హంపీ క్షేత్రము” నందలి ధార, “సౌందరనందము” నందలి మనోహరతా సారళ్యములు వీరి యమరావతి యందు గలవు. ఆచార్యులవారి కవితాసామగ్రి విశ్వశ్రేయమున కుపయోగింపగలది......”

—ప్రగతి

"అమరావతీ మహోజ్జ్వలగాథను వస్తువుగా చేసుకొని వ్రాసిన తొలికావ్యం ఇదే......బౌద్ధాన్ని కేవలం మతదృష్ట్యా మాత్రమే కాకుండా సాంఘిక రాజకీయ దృష్ట్యా చూడడం ఈ కవిలోని ఒక విశేషం. ఈనాటికీ అపరిష్కృతంగా మానవజాతిని పీడిస్తున్న సకల జీవితసమస్యలకూ పరిష్కారమార్గాలు బౌద్ధమతం చూపగలదని నిరూపించినాడు కవి ......అమరావతి శిల్ప శిథిలాలను జూచి కవిపొందిన దుఃఖావేశం ఇంత కాదు. పిచ్చి మతాభిమాన మెదచేస్పటచే జరిగిందే యీ బౌద్ధమత విధ్వంసం...విచ్ఛిన్న శిల్పకృతులను గాంచి కవి కార్చినకన్నీరు కావ్యాన్ని ఒక కరుణ వాహినిగా మారుస్తుంది......"

—ఆంధ్రప్రభ

"...అమరావతిలో కవి ఆంధ్రాభిమానము, శిల్ప కళారసజ్ఞత, బౌద్ధమత సిద్ధాంతముపట్ల యీయనకుగల అత్యంతాదరము ఒకదానినిమించి ఒకటి కొట్టవచ్చిన ట్లీకావ్యమున కనిపించుచున్నవి. కావ్యము నాతిసమాస భూయిష్ఠమై, వైదర్భీరీతిలో మనోహరమై, ఎచటముట్టినను కవిప్రతిభను చిప్పిల జేయుచున్నది. ప్రాచీన వైభవమును చవిచూపి పునః ఆంధ్రులను ఉత్తేజితులను జేయగల సామర్థ్యమును పుష్కలముగా గలిగిన యీ మధుర కావ్య మాంధ్రరసజ్ఞులో కాదరణీయము కాగలదనుట నిజము."

—విజయప్రభ

"మీరు వ్రాసిన అమరావతి చదివి సంతోషముబొందితిని. ఇంతగొప్ప గ్రంధము వ్రాసి ప్రకటించినందులకు ఆంధ్రులతరఫున నా అభివందనాలు ఇట్టి స్వతంత్రపుటాలోచనలతో స్వతంత్ర కావ్యవస్తువునూహించి రూపురేఖలు కల్గించుట శ్లాఘాపాత్రము. ఇట్లే నాగార్జునకొండ, భట్టిప్రోలు, కొణిదెన మున్నగు ప్రసిద్ధ క్షేత్రములను గూర్చియు ఆదర్శప్రాయమైన జాతీయ జీవిత విశేషములను జిత్రించుచు వ్రాయుదురని ఆశింతును. సెలవు."

—ఆచార్య రంగా

# పురావలోకనము

అమరావతి పేరు విన్నంతనే ప్రతి ఆంధ్రుని హృదయముకూడ ఉప్పొంగి పోవును; ప్రతి భక్తుని చిత్తముగూడ భక్తితో తన్మయమగును. ప్రాచీనకాలపు విజ్ఞాన వైభవమునకు, శిల్పకళా ప్రాభవమునకు, అఖండ బౌద్ధసంస్కృతికి గురుపీఠమై దేశ దేశాంతరములలో నాగరికతా దీప్తులను ప్రసరింపజేసిన అమరావతి ఆంధ్రులకే కాదు, భారతీయుల కందరికిని ఆరాధింపదగిన పవిత్రస్థానము; స్మరింపదగిన చారిత్రక ప్రదేశము.

శాతవాహన రాజులు మగధనుండి కన్యాకుమారిదాక దక్షిణాపథమును పాలించెడి రోజులలో కృష్ణానది యొడ్డున నున్న ధాన్యకటకము దక్షిణదేశపు నగరముల కన్నింటికిని తలపూవై ప్రకాశించినది. క్రీ. శ. 3వ శతాబ్దికి పూర్వమే — దక్షిణమున కాంచీనగరము ప్రాధాన్యమును పొందక మునుపే ఈ ధాన్యకటకము గొప్ప విద్యాస్థానముగను, బౌద్ధమత ప్రధాన పీఠముగను వన్నె కెక్కినది. ధాన్యకటకము నా దినములలో ధనకటకమని గూడ పిలుచుచుండెడివారు. ప్రస్తుత మిది ధరణికోటగా మారినది. పూర్వకాలమునుండియు ఈ ధాన్యకటకములో బుద్ధునిపూజ, అమరేశ్వరస్వామి పేర శివునిపూజ బహుళముగా జరుగుచున్నవని శాసనములవలన తెలియుచున్నది. అమరేశ్వరస్వామి గల పట్టణభాగము కాలక్రమమున అమరావతి అయినది. అనగా రెండువేల సంవత్సరములకు పూర్వము శాతవాహనాంధ్రరాజులకు రాజధానియై యొప్పిన ధాన్యకటకము కాలక్రమమున ధరణికోట, అమరావతి అను రెండుగ్రామములుగా రూపొంది మనకు దర్శన మిచ్చుచున్నది.

అమరావతిలోని అమరేశ్వరస్వామి దేవాలయము ఎప్పుడేర్పడ్డదో నిశ్చితముగా చెప్పుటకు వీలులేదు కాని, ఇది ఆంధ్రదేశీయులగు యాత్రికులచే సుప్రసిద్ధ పుణ్యక్షేత్రముగా నెన్నబడుచున్నది. దేవాలయములో ౧౧వ శతాబ్దికి చెందిన కోటకేతరాజు శాసనము, ౧౪వ శతాబ్దపు రెడ్డి రాజుల శాసనము, తరువాతి నాటిదగు శ్రీకృష్ణదేవరాయల శాసనము ఉండుటచేత మధ్యకాలమునకూడ నిది సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమై ఆంధ్ర రాజుల దృష్టిని బాగుగా ఆకర్షించినదని చెప్పవలయును. పురాతత్త్వవిదులు "మొట్టమొదట నిది బౌద్ధదేవాలయమనియు, పిమ్మట అమరేశ్వరాలయముగా మార్పబడినదనియు" ఆలయమునందలి బాహ్యాంతర చిహ్నములనుబట్టి నిర్ణయించుచున్నారు. ఏది ఏమైయున్నను ఈనాడు మనము స్మరించుకొను అమరావతీ వైభవము పూర్వపు ధాన్యకటకమునకు గూడ సంబంధించినదని మఱచిపోగూడదు.

బౌద్ధమతవ్యాప్తికి పూర్వము హైందవమత ప్రాబల్యముగల దినములలోని అమరావతినిగూర్చి మనకు సుస్పష్టములైన గుర్తు లెక్కువ కనబడవు కాని, బౌద్ధస్తూపము నెలకొన్న నాటినుండియుగల అమరావతి చరిత్ర అమూల్యమని చెప్పవచ్చును. కరుణామూర్తియగు బుద్ధదేవుని అవతరణము హిందూదేశమునకే కాక ప్రపంచమునకంతటికిని మేలుగూర్చినది. భారతదేశము యజ్ఞకలాపములలో చిక్కుకొని ప్రబల హింసాకాండలలో చిందులు త్రొక్కుచున్న రోజులలో - అహింసాధర్మమును విస్మరించి ప్రాణుల రుధిరపానముతో మత్తిల్లిన కాలమున దయాసింధువు బుద్ధదేవు డవతరించి జీవకారుణ్యము నుద్బోధించి లోకమునకు సంతరణభిక్ష పెట్టి పోయినాడు. బుద్ధదేవుడు నిర్వాణము చెందిన తరువాత బౌద్ధధర్మమును లోకములో విస్తరింపజేసిన మహనీయుడు అశోకచక్రవర్తి. ఈతఁడు మగధలో స్థానిక

ముగా వర్ధిల్లుచుండిన బౌద్ధమతమును విశ్వవ్యాప్తము చేయనెంచి దేశ దేశములకును బౌద్ధభిక్షువులను ప్రచారకులనుగా పంపినాడు. అట్టివారిలో ఆంధ్రదేశమునకు వచ్చిన బౌద్ధమత ప్రచారకుడు మహాదేవ భిక్షువు. ఈతడు మగధకు ముఖ్యపట్టణమయిన పాటలీపుత్రములోని మహాసాంఘికులకు నాయకుడు. ఈ మహాదేవభిక్షువు ధాన్యకటకమును నివాసముగా చేసికొని, శాతవాహన భూపాలుర యాదరాభిమానములను చూఱగొని, బౌద్ధమతములో "చైత్యకవాద" మను నొక సంప్రదాయమును స్థాపించినాడు. మహాసాంఘికవాదమునకు చెందిన యీ బౌద్ధము ఆంధ్రదేశములో వ్యాపించుటకు మహాదేవ భిక్షువు నాంధ్రమునకు పంపిన అశోకచక్రవర్తి యెంతయును స్మరణార్హుడు.

అమరావతీ ప్రాచీన శోభను స్మరింపజేసెడు ముఖ్యచిహ్నము "అమరావతీ స్తూపము" ఈ స్తూపపు కట్టడములను చూచినచో ఇది ఒక్కసారిగా నిర్మింపబడలేదని తోచును. ఇందలి ప్రాచీన నిర్మాణకృతులనుబట్టి ఈ స్తూపము క్రీ. పూ. రెండు మూడువందల సంవత్సరముల నాటిదని గట్టిగా చెప్పవచ్చును. బుద్ధుడు నిర్వాణము చెందిన పిమ్మట అతని శరీరావశేషములను బెట్టి ఎనిమిది ప్రధానస్తూపములను ఆయా తావుల గట్టించిరనియును, వానిలో నొకటి అమరావతీస్తూపము కావచ్చుననియును కొందఱి యూహ. అశోకుడు బౌద్ధమతమును విస్తరింపచేయ దలచి ఆ ప్రధాన స్తూపములలో నేడింటిని తెఱపించి యందలి యెముకలను ఎనుబది నాలుగువేల ముక్కలు చేసి ఆ యా తావులలో బౌద్ధస్తూపములను నిర్మింప జేసినాడట. అట్టి శారీరక ధాతువులు గలవియే అమరావతి నాగార్జున కొండలలోని స్తూపములని కొందఱ అభిప్రాయపడుచున్నారు. ఏది యెట్లయినను ఆంధ్ర వంశీయులగు శాతవాహనులు బౌద్ధమతము నాద

రించి, అమరావతీ చైత్యమును బహుకీర్తుల పెంపొందించినారు. క్రీ. పూ. 200 సంవత్సరములనుండియు క్రీ. శ. 300 సంవత్సరములవఱకును అమరావతిలోని యీ స్తూపము, బౌద్ధవిజ్ఞానము, ఆంధ్రుల ప్రతిభ మూడును పూవులు అఱుకాయలై పెంపు చెందినవి.

కరుణామయులగు బౌద్ధమత ప్రచారకులు తమ బౌద్ధవిహారములను స్తూపములను, చైత్యములను, నదీతీర ప్రదేశములందు సృష్టించినారు. ముఖ్యముగా ప్రయాణసౌకర్యము నుద్దేశించి ప్రచారము బాగుగా సాగునని వారీ యేర్పాటు చేసి యుండవచ్చును. కృష్ణానది యొడ్డుననే అమరావతి, నాగార్జుననికొండ, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, ఎత్తిపోతల, ఘంటసాల మున్నగు తావుల బౌద్ధక్షేత్రములు వెలసియున్నవి.

ఆంధ్రదేశపు బౌద్ధక్షేత్రములలో అమరావతి శిరోమణి వంటిది. ఇది బౌద్ధమతమునకూ, ఆంధ్రసంస్కృతికీ, అనుత్తమ శిల్పకళకూ నివాసమగుటయే కాక, సుప్రసిద్ధ విశ్వవిద్యాలయమై కూడ కీర్తి గాంచినది. వైదిక యుగములో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకును, అందును ముఖ్యముగా బ్రాహ్మణులకును మాత్రమే చదివెడు నధికారము గల వేదాది విద్యలు బౌద్ధయుగములో మానవమాత్రుల కెల్లరికిని పఠనీయము లైనవి. వర్ణభేదములు బౌద్ధమతములో లేవు. ఎవడు విజ్ఞానవంతుడో, సదాచార పరాయణుడో, వాడే బౌద్ధుల దృష్టిలో పూజనీయుడు. ఈ విధము లైన విశ్వజనీన భావములతో ఆనాటి సంఘమునకు బుద్ధుడు పూజనీయుడైనాడు; బౌద్ధవిజ్ఞానము ఆదరణపాత్ర మయినది.

విద్యావ్యాప్తికి అమరావతి గురుపీఠమై వేలకొలది శిష్యులకు విద్యాదానము చేసెడి మహాచార్యులతో నిండియుండెడిది. భారతదేశము నలు

మూలల నుండియే కాక, అన్య దేశములనుండియును వేనకువేలు విద్యార్థి లాషు లిచ్చటికి వచ్చి విజ్ఞానమును గడించి పోవుచుండెడివారు. దేశ దేశ ములనుండి వచ్చి సాంఘికాధ్యాత్మికాది విషయములను జర్చించెడు మహావ్యక్తులతో నీ సంఘారామము కళకళ లాడుచుండెడిది. ఆనాటి అమరావతీ విశ్వవిద్యాలయములో ఏ యే విజ్ఞాన సాగరములు మథింప బడుచుండెడివో, ఏ యే కళ లభ్యసింప బడుచుండెడివో, ఆశోభ యెంతగా నుండెడిదో ఎవరు చెప్పగలరు? ఆ నాటి ఆంధ్రుల వైభవమును రాయ ప్రోలు కవి "అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు" అని స్మరించుకొన్నాఁడు.

బౌద్ధమతస్థులకు రెండవ బుద్ధుడు వలె పూజనీయుడైన నాగార్జునా చార్యుని కాలములోని అమరావతీవిద్యాపీఠము నాదర్శముగా తీసికొని "టిబెట్టు" దేశములోని "లాసా" నగరమునకు సమీపమున నున్న "డాపంగ్" సంఘారామము నిర్మింపబడినది. "డాపంగ్" అనగా టిబెట్టు భాషలో ధాన్యరాశి యని యర్థము. మన అమరావతి పూర్వనామము ధాన్యకటకము కాబట్టి టిబెట్టుబౌద్ధులు కూడ ఆ పేరుతోనే విద్యాలయ మును స్థాపించినారు. అన్యదేశములకు కూడ ఆదర్శప్రాయ మైన విద్యాపీఠ మును నిర్వహించిన అమరావతి, ఆంధ్రదేశము ఎంత అదృష్టము కలవో చూడుడు! డాపంగ్ విద్యాపీఠములో ౭౭౦౦ బౌద్ధభిక్షువులుండెడివారు. అటుకళాశాలలుగల విశ్వవిద్యాలయ ముండెడిది. ఇట్టివివరము లన్నియును అమరావతిని గూర్చి గూడ తెలిసికొనుటకు దురదృష్టవశాత్తు మన బౌద్ధ వాఙ్మయము నాశనమయి పోయినది. బౌద్ధయుగములో ఉత్తరహిందు స్థానమున తక్షశిల, నాలంద, ఓదంతపురి మున్నగువిద్యాపీఠములు ప్రసిద్ధ ములు కాగా, దక్షిణ భారతమున ధాన్యకటకము, వేగి, కాంచీపురము,

శ్రీశైలము (అనగా నాగార్జున కొండ) మున్నగునవి సుప్రసిద్ధ విద్యాపీఠ
ములై ప్రకాశించినవి.

అమరావతీ స్తూపమును సిద్ధ నాగార్జునుడుగూడ బాగుగా నభివృద్ధి
చేసినాడు. స్తూపమునకు చుట్టునున్న ప్రాకార మీతడు కట్టించినదే. ఇతడు
శాతవాహనునకు వ్రాసిన "సుహృల్లేఖ" అద్భుతమైనది. ఈతని పేర వెల
సిన నాగార్జునకొండ మహిమ, శిల్పసంపద నేటికిని మనము చూచుచునే
యున్నాము.

మహాదేవభిక్షునిచే ఆంధ్రదేశములో ప్రచారము చేయబడిన—మహా
యానశాఖకు జెందిన బౌద్ధవిజ్ఞానము ఒక్క ఆంధ్రదేశములోనే ఉండిపోక
ఉత్తరాన టిబెట్టువఱకును, దక్షిణాన సింహళద్వీపమువఱకు గూడ వ్యాపిం
చినది. సింహళద్వీపములో "అనూరాధాపురము"న మహాస్తూపము నిర్మిం
పబడు నపుడు ఆంధ్రదేశమునుండి వెడలిన బౌద్ధాచార్యులలో మహాదేవ
భిక్షువొకడు. ఇతడు పల్లవభోగమని పిలువబడెడు ఇప్పటి పలనాటినుండి
నాల్గులక్షల అఱువదివేల భిక్షువులను వెంట దీసికొని పోయి, సింహళద్వీప
ములోని స్తూపస్థాపనలో పాల్గొని బౌద్ధవిజ్ఞానమును ప్రచారము చేసినాడు.
ఈతని వెంట ఎంత ఆంధ్రసంస్కృతీ, ఆంధ్రశిల్పమూ అక్కడికి దిగుమతియై
యుండునో ఊహింపుడు.

మనస్సును మోహముగ్ధ మొనర్చి ఉద్రేకమును గలిగించెడి సుందర
వస్తువులను చూచుట, నిర్మించుట, ఆరాధించుట కూడదని బుద్ధుడు నిషే
ధించినాడు. అయినను సంసారతరణమునకు మార్గముచూపిన బుద్ధదేవుని
యందలి భక్త్యతిశయము తరువాతి బౌద్ధులలో భక్తిపూర్వకమైన కళాభిర
తిని వెలకొల్పినది. ఈదృష్టితో వారు బుద్ధుని స్వరూపమును శిలలమీద

తీర్చియు, చిత్తరువులలో వ్రాసియును తమ కృతజ్ఞతా పూర్వకమైన భక్తిని వెల్లడించుకొనువారు. క్రమక్రమముగా బుద్ధుని జీవితగాథలు, అర్హుల జీవిత ఘట్టములు, చరిత్రలు, శిల్పముగా రూపొందినవి. బుద్ధదేవుని పూర్వజన్మము లందలి గాథలను జాతక కథలనుగూడ శిలలపై చిత్రించుటకు బౌద్ధులు పూనుకొన్నారు. సామాన్యమైన మతచిహ్నముగా నుండవలసిన స్తూపము మీదగూడ అఖండమైన శిల్పమును దిద్దుటకు సంసిద్ధులైనారు. ఈవిధముగా విగ్రహారాధన లేని మతములో బుద్ధారాధన మొదలైన క్రియలద్వారా శిల్పకళ, సౌందర్యపూజ తావు చేసికొన్నవి. వేయేల? బుద్ధారాధన తాత్పర్యముతో బౌద్ధులెన్నియో మహా శిల్ప కావ్యములను నిర్మింప చేసినారు.

బౌద్ధ యుగమునాటి శిల్పాచార్యుల సిద్ధహస్తాలలో రూపొందిన కళాసామగ్రిలో స్తూప నిర్మాణ మొకటి. ఈ స్తూపనిర్మాణములలో అమరావతీస్తూప శిల్పసౌందర్యము దేశ దేశములూ కొనియాడదగినది; త్రిజగన్మోహనమైనది. ఆ "ఆయకకంబాలలో, ఆ ప్రాకారపు గోడమీద, ఆ స్తూపపు అండాకృతిలో ఎన్నెన్ని లతలు, ఎన్నెన్ని విగ్రహాలు, ఎన్ని గాథలు, ఎంతటి దైవశిల్పము మూర్తీభవించిన దనుకొన్నారు! ఆ అధిష్ఠాన చిత్రములను తిలకింపుడు. ఆ ఊర్ధ్వపటచిత్రాలను చూడుడు—ఎంత అమానుషశిల్పము తాండవించుచున్నదో! ఆ ఉష్ణీషచిత్రాల మీదిదంతా దైవశిల్ప మన్నచో అతిశయోక్తి గాదు. చైత్యశిలాఫలకాలమీద కొలువు దీరి యున్న బుద్ధమూర్తి, ఆయనను పరివేష్టించిన ఆ పరివారమూ యథార్థముగా ఆకాలపు బుద్ధుని ధర్మసభనే తలపించుచున్నది. ఆహా! ఆ ఒక్క యక్షిని తీర్చుటకే మన ఆంధ్రశిల్పి తన జీవితమును ధారపోసి యుండవచ్చును. ఆ ధర్మచక్ర స్తంభపు సోయగము, ఆ వేదికావృత్త చిత్రము, ఆ బుద్ధదేవుని పాదాలు ఎంత అందమును చిందుచున్నవి! ఇది యంతయు

సౌందర్యప్రవాహిత. చిరికి జీర్ణించిన ఈ శిలాఖండములు ఎంతటి శిల్పోపదంత
మును, సౌందర్యమును చాటుచున్నవి! ఆంధ్రశిల్పాచార్యుల ఈ అతిలోక
శిల్పచాతుర్యము అమరావతీ స్తూపకృతికి అనన్యశోభను చేకూర్చి, భార
తీయ శిల్పసంప్రదాయములలో "అమరావతీరీతి" అను నొక ప్రత్యేక
స్థానమును సంపాదించుకొన్నది. ఈ విషయము డా. ఆనందకుమారస్వామి
ప్రభృతుల గ్రంథాలలో సుస్పష్టమగును.

అమరావతి సారస్వతవిద్యావిషయములలో, సంస్కృతిలో ఎంతగా
మిన్నందినదో, అంతకు వేయిరెట్లెక్కువగా శిల్పకళాప్రౌఢిమలో గురు
పీఠమును బొంది అతిశయించినది. అమరావతీశిల్పకళ దేశీయము కాదనియు,
గ్రీకులనుండియో, రోమనులనుండియో ఈ కళ నాంధ్రులు నేర్చుకొన్నా
రనియు కొందఱు చెప్పెడి వాదము సత్యదూరము. దాక్షిణాత్య శిల్పరీతులు,
మన శాస్త్రానికి, సంప్రదాయమునకు అనుసంధించు కళామార్గములు అమరా
వతీ శిల్పములలో మూర్తీభవించి యుండుటచేత పై వాదను అంగీకార్యము
కాదు. ఆంధ్రదేశ శిల్పుల దివ్యశిల్ప కళాకౌశలమే యిది అంతయునని
నిరూపింప వచ్చును.

పూర్వము నాగార్జునకొండకు దగ్గఱగా "పెందోట" (బృహద్వని)
అను ప్రసిద్ధ నగరరాజ ముండెడిది. అది మహాశిల్పాచార్యులకు నివాసమైనది.
ఆ పెందోట శిల్పులే దేశమున శిల్పకళా తోరణములు వ్రేలగట్టినారు.
వారి చేతిచలువ వలననే అమరావతి, నాగార్జునకొండ మున్నగు బౌద్ధక్షేత్ర
ములలో అతిలోక శిల్పము వెలసినదని సంప్రదాయజ్ఞులైన పురావిదులు
చెప్పుచున్నారు. ఈ శిల్పాచార్యులకు "పెందోట పురవరాధీశ్వరు" లను
బిరుదముగూడ గలదు. ఇది విశ్వకర్మపురాణాది గ్రంథములలో స్పష్టముగా
తెల్పఁబడెను. నేటికిని విశ్వబ్రాహ్మణులను యాచించు "పనసలు రుంజ

వాంఁడ్రు, వారి కైవారములలో "పెందోట పురవరాధీశ్వరు" లని విశ్వకర్మీయులను బేర్కొనుట ఆచారమై యున్నది. దీనినిబట్టి శాతవాహనుల కాలమున పెందోట, అక్కడి మహాశిల్పులు ఒక్కవెల్గు వెలిగినట్లు విస్పష్ట మగుచున్నది. పురవరాధీశ్వరులను బిరుదు వీరికి రాచతీకమును బట్టి వచ్చినది. పెందోట చిరకాలము పంచార్షేయ బ్రాహ్మణ ప్రభువుల పాలనములోనున్నది. ౧౩౬౦ నుండి ౧౬౩౦ వఱకు ధవళేశ్వరపువారు దీనిని పాలించినట్లు ప్రమాణములున్నవి. ౧౪౮౦ నుండి నలుబదిసంవత్సరములు శ్రీధవళేశ్వరపు మార్కండేయ ప్రభువు పెందోటను రాజధానిగా జేసికొని ఆంధ్రదేశమును బరిపాలించుచు "నాగరఖండము"ను కృతినందినాడు * కాని చరిత్ర జాగరూకతతో జారవిడిచిన యీ శిల్పుల యుదంతము ఆ పెందోటవలెనే యుత్సన్నమైనది.

కరుడు గట్టిన వేదవిజ్ఞాన రాసు లనదగు నా శిల్పులు బౌద్ధ ప్రేరణమున బౌద్ధకళను చిత్రించినను వైదిక సంప్రదాయముతో దానిని చక్కగా సమన్వయించినారు. ఏ దేశపుస్తూపమునందును లేని ఆర్యక స్తంభ నిర్మాణమునందును, త్రిశూల కల్పనమునందును వీరు చూపిన బౌద్ధ వైదిక మత సమన్వయము కొనియాడ దగినది. సిద్ధనాగార్జునాచార్యుడుగూడ ఈ పెందోటయందలి శిల్పాచార్యుడే యని తెలియు చున్నది. ఆతడు సమీపస్థ మగు కొండ నావాసముగా చేసికొనుట, అందే స్తూపనిర్మాణము గావించుటగూడ పై వాదమునకు సహాయకారులుగా నున్నవి.

ఈ విధముగా మహా శ్రోత్రియులగు పెందోట శిల్పుల చేతిలో తీర్పబడ్డ అమరావతీ స్తూపకళ విదేశీయ మను వాదము హాస్యాస్పదము.

---

* ఈవివరములను 1951 సం॥ ఏప్రిల్ భారతిలో "పెందోటపురము మార్కండేయ ప్రభువు" అను వ్యాసమున జూచునది.

ఇట్లు బహుముఖముల వెలసిన అమరావతీ శిల్పచ్ఛాయల ననుసరించియే ఆ నాటి వస్త్రధారణ పద్ధతులు, నాట్యకళా విధానములు, మున్నగునవి మన మూహింప వచ్చును. నాగరికత బాగుగా పెంపొందిన దని భావింపబడు నీ దినములలోఁగూడ తలకట్టులు చుట్టుటలో నేమి, వల్లెవాట్లు వేయుటలో నేమి, కటివస్త్రములను గట్టుటలో నేమి ఆ "ఫ్యాషన్లు" లేవు. ఎన్ని రకముల నాట్యభంగిమలో మనము చూడ గలుగుదుము. జుట్టు కత్తిరించి మలచుటలోను, నానావిధములైన వేణీబంధములను సవరించుటలోను, ఆ నాటి వారి కెంతమోజో ఆ బొమ్మలను చూచినచో తెలియగలదు. యుద్ధవీరులు ఆ యా ఆయుధాలను బట్టిన రీతులు, వారి అవయవ విన్యాసములు ఎంత హృద్యములు! ఆ నాటి స్త్రీలుకూడ అత్యద్భుతాలైన అలంకారములను ధరించెడివారు. రాణులు, ధనిక స్త్రీలు నుదుటిమీదికి వ్రేలాడు పాపటిబొట్టువంటి ఆభరణమును ధరించెడివారు. అమరావతీకాలపు స్త్రీలు తమ సౌందర్యమును, శృంగారమును ఎంతగా పోషించుకొనెడి వారో ఆ నాటి శిథిల కృతులను జూచిన తెలియును.

ఈ పవిత్రక్షేత్రములోనే శ్రీముఖాది చక్రవర్తులు, ఆపస్తంబాది మహర్షులు, శాలివాహనాది కవిరాజులు, మహాశిల్పులు, సిద్ధనాగార్జునుడు, భావవివేకస్వామి, మున్నగు బౌద్ధాచార్యులు, తమవివిధకళాప్రతిభలను వెల్లివిరియించినారు. ఆ నాటి వణిక్కుల వ్యాపారనౌకలతో కృష్ణానది కళకళ లాడుచుండెడిది. వివిధ పరిశ్రమలు, సాధారణ శిల్పములు జనసమూహముయొక్క నిరుద్యోగసమస్యను దూరీకరించుచుండెడివి.

ఇంతటి సముజ్జ్వల చరిత్రకు పంటపొలమైన అమరావతి క్రీ. శ. నాల్గవ శతాబ్దినుండి బౌద్ధమతములో వచ్చిన తాంత్రిక పద్ధతి కారణముగను,

రాజకీయపరిణామములు కారణముగను, పౌరాణిక మతప్రాబల్యము కారణముగను జీర్ణస్థితికి వచ్చినది. కుమారిలభట్టు, శంకరాచార్యులు మున్నగు హైందవాచార్యుల వలన బౌద్ధ మున్మూలింపబడినది. పెక్కు మతయుద్ధములలో అమరావతి దెబ్బతిన్నది. శాతవాహనుల రాజ్య మంతరింప, పల్లవులు, విష్ణుకుండులు, చాళుక్యులు, కాకతీయులు మొదలగు వంశముల వారు పౌరాణిక మతమును ప్రేమించి ప్రచార మొనర్చినారు. మఱల వర్ణవ్యవస్థ, అర్థరహితమగు తర తమభావము ప్రజలలో రేకెత్తి బౌద్ధ యుగము నాటి ఆ విజ్ఞానవైభవము, ఆ శిల్పసంపత్తి, ఆ వీరవిక్రమము, ఆ సంస్కృతి అన్నీ సన్నగిలి పోయినవి. ఏడవ శతాబ్దిలో "హుయెంత్సాంగు" అను చీనా బౌద్ధయాత్రికుడు వచ్చినప్పటికే ధాన్యకటక వైభవము క్షీణదశలో నున్నట్లు తెలియుచున్నది. తరువాత క్రమముగా నది యంతయు రూపటి యీ నాటికి దీపాలదిన్నె పేరు మాత్రము మిగిలినది. ఇప్పుడు మన కేమున్నది? ఆ ప్రాచీన అమరావతీ వైభవమును దలంచుకొని "అశ్రువులు రాల్చి జీవచ్ఛవాంధ్రజనులు."

(1948 ఏప్రిల్ - భారతిలోని "అమరావతి - విజ్ఞానపీఠము" అను నా వ్యాసము)

## మనవి

కలకత్తాకును, లండనుకును నడచిపోయినవి పోగా శేషించిన అమరావతీస్తూప శిల్పఖండములను నావిద్యార్థిదశలో మద్రాసు మ్యూజియమున చూచుట తటస్థించినది. అత్యద్భుతములగు నాకృతులు చిత్తము నాకర్షింప అమరావతీ ధాన్యకటక చరిత్రములను, అలనాటి బౌద్ధాంధ్ర వైభవమును, ఆంధ్ర సంస్కృతి విశేషములను ఆకళించుకొన బూనితిని. ఇది యంతయు నొకరమణీయఖండకావ్యము కాగలదని భావించి పూర్వాంధ్ర

సంపత్తి కెడదయుపొంగి యీ కావ్యమును సంతరించితిని. ఇందు కావ్య కళానిర్వహణమునకు అయ్యైకథలను, గాథలను, చరిత్రాంశములను అనువుగా పొందుపఱచుకొంటినే గాని, అభూతకల్పములను జేయ దొరకొనలేదు. కాగా మహాదేవ భిక్షువు వచ్చునాటి కిచ్చట శాతవాహన రాజ్యము నెలకొనెనా, లేదా యనునంశమును ఇంతవఱకు చరిత్రయే రుజువుచేయలేదు. అయినను కావ్యకళాదృష్టితో నది యట్లే యై యుండునని నేనూహించితిని. విషాదఖండములోని "కుమారిలభట్టు బౌద్ధులనోడించెనన్న గాథ" క్రమక్రమముగా బౌద్ధముపొందిన యధోగతికి కారణభూతమై యుండునని యుద్దేశించితిని.

ఇట్లు ప్రాచీనాంధ్ర రాజ్యవైభవమునకును, అమరావతీ శిల్పకళాలక్ష్మికిని దర్పణముగా నుండున ట్లీకృతి రచితమైనది. అమరావతీ చరిత్ర పరిచయమునకై భారతిలోని నావ్యాసమునుగూడ "పురావలోకనము,,గా నిందు జేర్చితిని.

ఈకావ్యరచనములో నాకెక్కువగా నుపయోగించినవి "ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము"లో శ్రీ. టి. యన్. రామచంద్రన్ గారు వ్రాసిన "అమరావతీస్తూపము,, అనువ్యాసము, అందలి చిత్రములు; శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారి "బౌద్ధచారిత్రిక వ్యాసములు"ను. వీరి కెంతయు కృతజ్ఞుడను.

అమరావతీ వైభవస్ఫోరకముగా చక్కని ముఖచిత్రమును వ్రాసి యిచ్చిన మిత్రులు సుప్రసిద్ధాంధ్ర చిత్రకారులు శ్రీ గుఱ్ఱం మల్లయ్య గారికి ధన్యవాదములు.

మహితాశయములతో ఆరంభింపబడిన శిల్పకలాపరిషత్తు పక్షమున ఈ నూత్నకావ్యము నాంధ్రమహాజనుల కందించు కొనుచున్నందుల కెంతయు సంతోషము.

సత్తెనపల్లి
15-1-1950

వీరరాఘవాచార్యులు
శిల్పకళాపరిషత్తు

# కృతి నేత

శ్రీ సాగర్వాలాన్వయ
భాసురు, రస భావ బహుళ భాషాకావ్యా
భ్యాస్ఫూర్తమేశుం డేలుత
కేసరిసింగు న్నితాంత కీర్తి శ్రీలన్.

అతఁ డొక సాహితీ రసికుఁ డన్న యథార్థము విన్నదాది, స్నే
హితునిఁగఁ జేసికోఁ దలఁపు హెచ్చె; నొక ష్టవధాన వేది మత్
ప్రతిభ, కవిత్వ నైపుణము, పాండితి గన్గొని ముగ్ధుఁ డయ్యె నా
చతురుఁడు; నాఁటినుండి నడిసన్నిగారపుచెల్మి నూల్కొనెఁ.

ఉత్తమ క్షత్ర వంశోద్భూతి నెలకొన్న
పరిపాల నోచిత ప్రాభవంబు
జనకుండు తత్వవిజ్ఞాని రుస్తుంసింగు
పిననాఁటి నుండి నేర్పిన నయంబు
అదర్శమాత విఖ్యాత లక్ష్మిబాయి
వెన్నతోఁ బెట్టిన వినయ శీల
మాబాల్యముగ కళాభ్యాస యోగంబులో
ప్రబలిన సాహితీ రస పిపాస

తన పురా సుకృ తోదారతా విభూతి
కనుప మాయూల్యా భూషలై యందగింప
నతిశయిల్లు నిజాన్వవాయ ప్రసిద్ధి
చెలువములు చిమ్మ కేసరిసింహుం డవని.

మాటలయందు శౌర్య మణుమాత్రము చూపకయున్న, చేతలం దోటమియున్న దీ యనఘు నుత్తమ జీవితమందు లేదు; మో మోటము దక్క సత్య మెటులున్న నటుల్ వచియింప నేర్చు; నీ మాటలు వేయునేటి కనమానుం డుదాత్తగుణ ప్రవర్తనన్.

నవనీతోపమ మైన మానస, మనన్యప్రాప్య గాంభీర్య వై భవ, మత్యద్భుత కార్యదీక్ష, కరుణాపారీణ భావంబు, సత్ కవి విద్వజ్జనతానురక్తి, మహితౌదార్యాది సంపత్తి ప్రాగ్ భవ పుణ్యంబున సంక్రమించినవి విద్వల్లోక భాగ్యంబుగన్.

"న్యాయాన్యాయ విచార దక్షమగు ప్రజ్ఞానైపుణిం దీర్పులన్ జేయ న్నేర్చిన పుణ్యమూర్తి యగు "మేజిస్ట్రే"టితండంచు" నే న్యాయజ్ఞుం డురు కీర్తి వల్లరుల నాంధ్రారామము న్నించెనో మాయా కేసరిసింగు మూరిజన సమ్మాన్యుండు వర్ధిల్లెడున్.

అన్నపూర్ణాంబ సాధ్వి విద్యా వివేక
వినయ సౌశీల్య శాలిని తనకుఁ గూర్చు
ధర్మచారిణి పతిదేవతా వ్రతంబు
నెఱపఁ జెలువొందు నీ కావ్యనేత సతము.

ఆ లోతైన యెడందలోఁ దొలఁకు సౌహార్దంపు సొంపా ముఖ
శ్రీ లో లాస్యము చేయు చిన్ని నగ వా దృగ్వీథిలోఁ దోచు ల
క్ష్మీ లాలిత్య ముదాత్త గౌరవము సూచింపంగ సాహిత్య సే
వా లబ్ధిన్ బరిపూర్ణుఁడౌ ననుచు సంభావింతు నీ పుణ్యునిన్.

ఏ జన్మంబున సత్కవిత్వమున బ్రాహ్మీపూజ గావించెనో,
యీ జన్మంబున సక్రమ కావ్య లలనా హేవాకము ల్మెచ్చు ధీ
రాజద్వైభవ మబ్బె; నిద్భృశ కళా రామా మనోహారికిన్
రాజన్యాగ్రణి కస్మదీయ కృతి కన్యారత్న మర్పించితిన్.

మా మధురకావ్య నేత క
సామాన్య యశో విశేష సహితునకు, గుణ
శ్రీ మహితున కిష్టార్థము
లేమఱక యొసంగుఁ గాత మీశ్వరుఁడు దయన్.

# జే జే లు

తెలుఁగురాజుల పతాకలనీడలో జనుల్
సుఖనిద్ర గన్న రోజులు దలంచి
తెలుఁగుశిల్పుల కళావిలసనమ్ములకు ది
గ్దేశముల్ కైసాచు దినము లరసి
తెలుఁగుసంస్కృతి కెడందలు పల్లవింప దీ
వులు గడించిన నేరుపుల నెఱింగి
తెలుఁగుయోగుల యుపదేశము ల్వాని ఖండ
ఖండము ల్తరియించు గాథ లెన్ని
తెలుఁగు టిల్లాంధ్ర మేలైన చెలువములకు
జగము కైవారమొనరించు చరిత దడవి
తెలుఁగుల గురుత్వమహిమ బుద్ధిం దలంచి
తెలుఁగుతల్లికి జేజేలు పలుకవోయి !

# ఆముఖము

మన యమరావతీ మధుర మంజుల గాథలు ద్రవ్వి శాతవా
హన జనపాలు రేలిన పురాంధ్రము నారసి బౌద్ధభూతి నిం
డిన యలనాఁటి తెల్గుమహనీయత కాత్మ గరంగి పాడెదన్
దెనుఁగుల సచ్చరిత్రము లతిప్రతిభల్ బహుధావ్యథావళుల్.

మతి యుప్పొంగి తరంగితంబగును సుమ్మా నాఁటి బౌద్ధాంధ్ర వి
స్తృత కల్యాణకథానికల్ విజయలక్ష్మీ వీరగాథ ల్వినన్;
శతథా గుండియ వ్రీలు ధాన్యకటకైశ్వర్యమ్ము వమ్మైన యా
కత లాలించిన జాతికేనియును దుఃఖమ్మేచి ముంచెత్తఁగన్.

కనులకుఁ గట్టు ధాన్యకటక ప్రథితాద్భుత శిల్పదృశ్యముల్
మనన మొనర్చి తత్కథలు మానసవీథినిఁ దాండవింపఁగాఁ
గని తదుదంతమెల్ల నవ కమ్రగుణోజ్జ్వల కావ్యశైలిఁ జి
త్రణ మొనరించి యాంధ్రజనతా హృదయాలకుఁ గాన్కవెట్టెదన్

ఈ స్వాతంత్ర్య నవోదయారుణరుచుల్ హేరాళమై పర్వ, ప్రా
ప్తస్వారాజ్య శతాంగ చోదనకళా ప్రాగల్భ్య మర్థించి, నూ
త్నస్వాదిష్ఠ మనోజ్ఞ కావ్యరస తృప్తస్వాంతులై నేఁటి యాం
ధ్రస్వాము ల్గడియింత్రు గావుత నిజౌన్నత్య ప్రభావంబులన్.

రావోయీ! మహితాంధ్రసంస్కృతికథా
రమ్యాంకముల్ చిత్తమం
దవో యూహల మేలుకొల్పి కవితా
హిందోళముం బాడ నూ
త్నావేశంబు ఘటించుచున్నయవి; పూ
ర్వాంధ్రప్రభావంబు చే
తోవీథి న్నటియింపఁ బాడుచు సము
ద్యోగింత మీ వేళలన్.

# ఉ ప దే శ ము

ఏ విశిష్ట ముహూర్తమం దిచట బౌద్ధ
చైత్యమున కంకురార్పణ సలిపినారొ,
మూఁడుపూ లాఱుకాయలై ముమ్మరించె
శిల్పమున్ను ధర్మమును జేయి చేయి గలిపి.

ఎం దహింసాధర్మ మినుమడించుట జన్న
ములు జాతరలు రూపములు దొఱంగె
ఎందు జాతివిభేద మిసుమంత పొడసూప
కావహిల్లును మానవాళి సమత
ఎం దింద్రియములు యమింపంగఁబడి మహా
నిర్వాణపథము రాణించు ప్రజకు
ఎందు సర్వజ్ఞ మునీశ్వర బోధ సు
ధాసార మెడపక తన్పు జనుల

అట్టి బౌద్ధమతమ్ము సర్వావనీ త
లాన వ్యాప్తమ్ము సేయఁగాఁ బూనె నౌర!
మగధ భువనాధిపతి విశ్వమాన్యుఁడౌ య
శోకనరపాలుఁ డపగతశోకుఁ డగుచు.

ఇచట నశోకుని పనుపునఁ
బ్రచురింపఁగ బౌద్ధధర్మ పద్ధతులు ప్రజా
నిచయమ్ములోన నాగమ
విచక్షణుం డొక్క బౌద్ధభిక్షువు వచ్చెన్.

ఆ మహాదేవభిక్షుకు నంత మునికి
విహరణస్థానమైన యివ్వీటఁ దెల్గు
ప్రాజ్య సామ్రాజ్యరమ క్రొత్తవలపు తీనె
శాతవాహన రాజభుజమ్ము లెక్క.

విహరించినది తెల్గువీరుల బావుటా
ధర్మమ్ముతో దిశాంతములయందు,
దిద్ది తీర్చినది దిగ్దేశమ్ములను నాంధ్ర
సంస్కృతి నూత్నవాసనలు చిమ్మ,

ఆవరించినది భూమ్యాకాశములు నిండ
వైదికాంధ్రుల కళా ప్రాజ్యమహస్సు,
ఆదరించినది దయార్ద్రచిత్తము యోగ్య
తాముల మగు నే మతంబు నైన
శాంతి దైవార సర్వప్రజా సుఖమ్ము
వెలయఁజేసిన దలనాఁటి తెలుఁగుజాతి;
"తెలుఁగుమిత్ర" నటన్న మేల్పలుకు జగతి
నిండి చాటంగ మన పురాఖండ యశము.

ఆ తఱి శాతవాహన ధరాధిపుఁ డాగత బౌద్ధధర్మ ని
ష్ఠితకు భిక్షుకాగ్రణి కనింద్యచరిత్రున కంజలించి, ధ
ర్మాతతబుద్ధియై వినె నుదాత్తములౌ ఘన బౌద్ధధర్మముల్
చేతము మెత్తనై కరుణచే నిలువెల్లఁ గరంగి పోవఁగన్.

"ఓ శాతవాహనాంధ్రా
ధీశా! వినుమన్న! యస్మ దీప్సితము జగత్
క్లేశాపహ మఖిలసుఖ
శ్రీశత వర్ధకము బుద్ధసిద్ధాంతమ్మున్.

భయ విషాద సందేహ దుర్భ్రమల గములు
శోకమోహము లెటఁ బరిశోష మంది
పొందు లోకము సుస్థిరానంద గాంతు
లా తథాగతు మతరీతు లసదటోయి!

అగపడని స్వర్గసుఖముల కాస చేసి
జన్నములయందుఁ బశువులఁ జంపునట్టి
పాపకృత్యము లన్ని రూపఱెఁ గదన్న!
బుద్ధదేవుని మహనీయ బోధకతన.

బుద్ధివిభవమ్ము మట్టిలోఁ బూడ్చి పెట్టి
గుణములను గర్మలను లెక్కగొనక జన్మ
చేత కులభేదములు సృష్టిచేయు కృతక
జాతినిర్ణేతలకుఁ బరాభూతి గలిగె.

మానవుడు మానవుని రక్తమాంసములను
చీల్చి తిని త్రేఁచి యాత్మతృప్తిని గడించు
ఘోర మారణ శక్తులు కూలిపోవె
ఆ యహింసాజగద్గురుఁ డవతరిల్ల?

చీమ మొదలుగఁగల సర్వ జీవకోటి
కడుపులో నీరు కదల కక్కటిక మలర
బ్రతుకుచుండవె యా ధర్మరాజు తపము
కారణము గాఁగ మర్త్యలోకమ్మునందు ?

వైదిక మతంబులో నభివర్ణితంబు
లౌ దశావతారమ్ములయందు బుద్ధ
దేవుఁ డొక్కఁడుఁ డా జగద్ధ్యేయమూర్తి
మత మెటు లనీశ్వరమ్మను మాట చెల్లు ?

దేశ కాల పాత్రంబుల తెరువు లరసి
ధర్మమును నిర్వచింత్రవతారమూర్తు
లా రహస్యం బెఱుంగని యట్టి జడులు
తగవు లాడుదు రేవొ స్వార్థమ్ము కొఱకు.

ఈశ్వర ప్రోక్త మతమె యనీశ్వర మయి
పోవఁగా నెవ్వఁ డీ మర్త్యభువనమునకు
శాంతిదీపిక వెల్గించి జాడఁ జూపు ?
సుంత యోచించుకొనుము నీ స్వాంతమందు.

ఏది యెటులైనఁ బరుల హింసింపకుండ
ఉపకృతి యొనర్చి మోక్షము నొందఁ గోరు
సత్య సముపేతమౌ యహింసామతంబు
దొడ్డదో చెడ్డదో చూడు మడ్డులేదు.

కలదొక బౌద్ధగాథ వినఁగాఁ దగు! మున్నొక కాపుకన్య యా
వుల నొకబీట మేపుకొనఁ బోయి యొకానొక ముద్దుపెయ్యకైఁ
గలిగిన పుండుమాంసమును గాకులు చీల్చి భుజింపఁ గాంచి లో
నలమటఁ జెంది పేర్చిన దయారసమట్లు కరంగిపోవుచున్.

భూతహితబుద్ధి లోపల ముమ్మరింపఁ
జిట్టి యాఁబెయ్యకును గట్టు కట్టి కాకి
మూఁకలను జోఁపి యటు తన బుద్ధిఁ దలఁచెఁ
జిత్త మపకార మొనరించి సిగ్గు పడఁగ.

ఈ పద్ధ మేలుగనె నా
వ్యాపారముకల్మిఁ గాని వాయసములు దా
మాపోవఁ దినెడి మాంసము
పాప మనక తీసితిం గృపా విరహితనై.

అకటా! దానము ధర్మముం దయయు తీవ్రాయాస సేవ్యమ్ములౌ
రక సాధింపఁగఁ జాలునా నరుఁడు స్వార్థత్యాగి గాకుండ? మా
మక మాంసం బిడియైనఁ గాకముల సమ్మానించి పాపంబు నం
సక పుణ్యంబునఁ బొదుఁగాకని ఘనత్యాగంబు ప్రేరేపఁగన్ ·

చేతికొడవలిచే నొండుచేయి చీల్చి
గాయ మొనరించి మాంసంబు కాకములకుఁ
దిండిగాఁ బెట్టె కారుణ్యదీక్ష యుదరఁ
గాపుఁ జిన్నారిపొన్నారి కలుప కంటె.

ప్రాఁతవడ్డ పురాణాలు పలుకుచున్న
వెప్పుడో చన్న శిబిరాజు సిద్ధచరిత;
కలియుగంబున నొక పేద కాపుకన్నె
మేనికండలు కాకి కామెతలు చేసె!

ఈ లోకాద్భుతవృత్త మారసి జినుం డెంతేని యుప్పొంగి తా
నాలోకించినదౌ దయావ్రతము ధన్యంబయ్యె నం చా కృపా
శీల న్మైత్రివచస్సులం దనిపి యాశీస్సిచ్చె రాజేంద్ర, వే
యేలా పల్కులు? బౌద్ధగాథలు శిలాహృద్వీథి నార్ద్రింపవే!

మును పు కళింగయుద్ధమున ముమ్మరమై ప్రవహించు రక్తవా
హినులను, ఘోరహత్యలను మృత్యుమహోగ్ర వికారనృత్యము
లని తన గుండె ప్రీలి వికలత్వము నెందఁగ బుద్ధదేవు బో
ధనల దయావ్రతమ్మున నుదారుఁ డశోకుఁడు దీక్ష పూనఁడే!

ఎందఱు రాజసింహులు మఱెందరు వైదిక ధర్మవేత్త లిం
కెందఱు శిల్పివర్యులును నెందఱు బౌద్ధవిపక్షులు న్మహా
నంద మెలర్ప బుద్ధు కరుణాకరయోగమునందు దీక్షలం
బొంది తరింపలే దఖిల భూతహితవ్రత పూతబుద్ధులై!

దుఃఖభూయిష్ఠమౌ జగత్తున నితాంత
శాంతి సముతాధికానంద సమితి నింప
బౌద్ధధర్మము దక్క భూపాల, నేఁడు
శక్తములు గావు పరమత శతము లెవ్వి.

పరుఁడు నావాఁడన్న భావంబు లేక
అందఱు భ్రాతల ట్లైకమత్యమునఁ
జరియింతు రే మత సామ్రాజ్యమందు
గణితలు సైతే మగ్గలమగు శక్తి

సామర్థ్యములు కల్మిఁ జతురతై మనుచుఁ
గ్రమధర్మములను సంఘమును సేవింత్రు;
చదువు సంధ్యలయందు జనములందఱికి
నమరియుండును సమానావకాశములు;
ధర్మసూత్రములు పొత్తముల లోపలనొ
వా విచ్చి చేయు నుపన్యాసములనొ
వెలయుట గాక జీవిత రంగమందుఁ
బ్రత్యంశమునయందుఁ బరిఢవిల్లెడునొ;
చుట్టఱికంబులు చూడంగఁ బడక
స్వార్థపరత్వంబు పాటింపఁ బడక
లంచగొండులచేత వంచింపఁ బడక
ధర్మపరుండౌ యుదాత్త మానవుఁడు
అర్హత్వమునుబట్టి యందునో పదవి;
సత్య దయా శౌచ సద్గుణంబులును
శమ దమాహింసాది సద్ధర్మములును
తాపత్రితయశోక దాహమ్ము నార్చు
నష్టాంగయోగమా ర్గాంబువాహమ్ము
ఏ మతమ్మున వెల్గు నెడపక సతము;
నిరుపమ నిర్వాణ నిత్య సౌఖ్యమ్ము

బౌద్ధదీక్షల నందు భక్తావతంసు
లంపఱ కగును హస్తామలకంబు;
ఏతద్గుణ విశిష్ట మీ బౌద్ధమతము
వెలయుంగఁ జెయఁ బృథ్వీ మండలమున
కంకణంబును గట్టె ఘనుఁ డశోకుండు;
ఆ మహాసమ్రాట్టు నానతి పేర్మి
దక్షిణాపథము బౌద్ధము నింప వచ్చి
దర్శించితిని గృష్ణతటమున నిన్ను.

ఈ కృష్ణాతటినీ తటంబునను భూమీశాన, చైత్యం బొకం
డే కాలంబును బౌద్ధధర్మలత పుష్పింపంగ సృష్టించి, ప్రే
మాకారుండగు శాక్యసింహముని పాదాబ్జద్వయీ దివ్యపూ
జా కైంకర్యమొనర్పు మాంధ్రజనతాస్వాంతంబులింపొందఁగన్.

గౌతమీ కృష్ణా ద్యఖండ పుణ్యాపగ
లాదరించినది యీ యాంధ్రభూమి,
తిరుపతి మంగళాద్రి ప్రముఖాద్భుత
క్షేత్రము ల్గల యీ పవిత్రజగతి,

శరణాగతత్రాణ భరణ దీక్షావిధి
నందె వేసినది యీ యాంధ్రజాతి,
గుణమె పూజాస్థాన మని గౌరవించు ను
దాత్తచారిత్రు లాంధ్రప్రభువులు,
ఇన్ని యుత్కృష్టగుణముల వన్నె కెక్కు
తెలుఁగుదేశములో బుద్ధదేవు మహిమ
పరిఢవిలెనేని బంగారు పరిమళించి
నట్టులే యాంధ్రదేశ మహస్సు వెలుఁగు.

భువన సంతారకము లైన బుద్ధదేవు
మహిత మంగళ సత్య ధర్మంబు లిచట
పాదుకొని దిగ్విదిక్కుల ప్రజల కమృత
దివ్య సందేశసుఖము లందించుఁ గాత.

శాక్యసింహుని పుణ్యాస్థి శకల ముంచి
కట్టవలె విశ్వమోహనాకార దర్శ
నీయమౌ స్తూపమొం డవనీతలేశ,
అనుమతింపగదయ్య! కల్యాణకాంక్ష.

క్షితి విశ్వకర్మసృష్టికఁ
బ్రతిసృష్టి యొనర్పఁజాలు ప్రజ్ఞానిధులౌ
శ్రుతిపారగులౌ శిల్పుల
వితతులు గలరఁటె యంధ్రవిషయమునందున్.

అప్పుడు మీ శిల్పయోగుల తపము పండి
శిలల రూపొందఁగా బౌద్ధగాథ లన్ని
దివ్యసౌందర్య మపనిపై దిద్ది తీర్చి
చెయుపతె బుద్ధమౌనికి శిల్పపూజ.

* * *

ఆ యతిలోకాధీశ్వరు
ని యుపదేశంబు నచ్చి యేలిక ప్రీతుం
డై యనుమతించెఁ ద్రిజగ
ద్గేయ స్తూపము రచించి కీరితి మించఁగ.

* * *

అది "బృహద్ధ్వని" "పెంటోట" యందు రాంధ్రు;
లసమ శిల్పీశ్వరులకు విహారసీమ;
ఆ మహాసూత్రధారులే యవని నెల్ల
మహిత శిల్పోపవనముగా మార్చి రంట!

ఆ "పెందోటపురాధిపాలకుల" శిల్పాచార్యులఁ వేద వి
ద్యా పాండిత్య గురుప్రభావులఁ గళాధౌరేయులం బిల్చి త
ద్భూపేంద్రుండు సమర్థులం దనిపి సొంపుం బెంపు వాటింపఁగా
స్తూపం బొక్కటిసృష్టి సేయుఁడనుచుఁ సోత్కంఠుఁ డర్థించుచుఁ.

ముమ్మరించిన వేడ్కఁ గర్పూరకలిత
క్రమతాంబూల మిడి భక్తి గౌరవించి
మణులు జాంబూనదము బహుమాన మొసఁగె
ఆత్త సర్వ కళామర్మఁ డాంధ్రరాజు.

అపరబ్రహ్మ లనంగఁ బేర్వడిన శిల్పస్వాములఁ దెల్గు దే
శపు పల్లీనగరమ్ములం గలుగు విశ్వబ్రాహ్మణ శ్రేష్ఠులఁ
విపరీతంబుగఁ దోడుచేసికొని యా పెందోట శిల్పాన్వయుల్
స్థపతు ల్పూనిరి ధాన్యవాటిక మహాచైత్యమ్ము నిర్మింపఁగఁ.

కలియుగంబున విశ్వకర్మనా బిరుదంబు
గని వాసిగాంచిన ఘనుఁ డొకండు
మాటట త్వష్టనాఁ బేరు గడించిన
యతిలోక నిర్మాణ చతురుఁ డొకఁడు

శిల్పసహస్ర విశిష్ట ప్రతిభ కల్మి
మయుఁడని నుతిఁగన్న మాన్యుఁ డొకఁడు
బహుమత ధర్మ సంపదలు శిల్పించఁగా
నపర మనుండైన స్థపతి యొకఁడు
శిల్పవేదము జీర్ణింపఁ జేసికొన్న
నిస్తుల ప్రతిభా మహనీయు లైన
సూత్రకారులు గొంద ఱా స్తూపశిల్ప
ఖండములు చెక్క నడుములు గట్టరపుడు.

విశ్వశిల్పమునకు విభుఁడయ్యె నే దేవుఁ
డాది శిల్పి నా కళాధినేత
విశ్వకర్మ వేదవిధిఁ బూజ లొనరించి
పూనుకొనిరి స్తూపమును రచింప.

★

# స్తూప శ్రీ

మూఁడు వందల యేఁడు లమోఘ తపము
చేసి సృష్టించి రీ స్తూప శిల్ప కృతుల
సిద్ధహస్తులు మన తెల్గు శిల్ప వరులు
తమ కళాశక్తు లన్నియు ధారపోసి.

చైత్యక సంప్రదాయ మిట స్థాపితమైన కతమ్మున న్మహా
చైత్య మటంచు నీయది ప్రశస్తి వహించి మహాంధ్ర సాంఘిక
స్తుత్య పవిత్ర పీఠమయి సొంపెసలారిన దా ధరాధిపా
దిత్యుల పాలనంబున నతిప్రతిభా కృత శిల్ప కావ్యమై.

అద్ది కారుణ్యమూర్తి బుద్ధాంఘ్రి దివ్య
పూజ కెత్తిన రత్న నిరాజనమ్ము;
అది జగచ్ఛాంతిమాత దివ్యావతారు
నర్చనము సేయు శిల్ప పుష్పాంజలి పుటి!

ఈ చలువఱాల ఖండాల నెన్ని రసము
లూరినవి, యెన్ని కథలు రూపొందినవి. మ
ఱెన్ని జగములు కళల సృష్టింపఁబడిన
వహహ! యీ యాకృతిశ్వరు లంటుకతన.

ఏ యమృతక్షణమ్ముల సృజించిరొ శిల్పికులీను లీ జగ
ద్ధేయములైన శిల్పములఁ; దెల్గుకళాప్రతిభల్ చరిత్రలో
మాయని కీర్తి వెల్గినవి మంజుతరాంధ్ర విశిష్టశైలికిన్
మా యమరావతీకళకు మంగళగీతము పాడె లోకముల్.

సృష్టించి రిట శాక్యసింహ స్వరూపంబు
కరుణారసము పొంగి కాల్వ గట్ట
కల్పించి రిట యక్ష కామినీమణులను
భువనసౌందర్యంబు ప్రోవు పడఁగ
శిల్పించి రిట బుద్ధ జీవిత చరితముల్
శీల సంస్కారముల్ చిగురు వెట్ట
చెక్కినా రిచట విచిత్ర జంతువులను
స్వాంత ముప్పొంగి హర్షమునఁ దేల

సృజన యొనరించి రిచట నచ్చెఱువు గదుర
నాంధ్ర సంస్కృతి నంత మహత్తరముగ
తెలి మెఱుంగుల నెలఱాల ఫలకములను
భువనములు మెచ్చఁ దమ కళాద్భుత చరిత్ర.

నలువురు శిల్పిబ్రహ్మలు
నిలువెల్లం ధారవోసి నిర్మించిరఁటె
లలితమగు బుద్ధసభ నొక
కళా నిధానంబుగా నఖండిత శక్తిన్.

మన ముప్పాంగ నుపన్యసించెడు నహింసాధర్మసిద్ధాంత బో
ధనముల్ వీనుల విందుగా వినుచుఁ జిత్రప్రక్రియం బొల్చు న
మ్మనుజవ్రాతపుఁ దన్మయత్వ మెటు నిర్మాణించెరా, శిల్పి? యా
తని కెంగేలికిఁ జల్వఱాయి నవనీత ప్రాయమై పోయెనో!

"సూచీ శిల్పము" లందుఁ జెక్కిరి జనస్తుత్యంబులౌ యేన్గులన్.
బ్రాచీనాంధ్ర జనాళి వైఖరులఁ దెల్పంజాలు మే ల్మూర్తులన్
వాచాతీత మనోజ్ఞ పద్మముల శుంభ ద్దివ్య శిల్పైక వి
ద్యాచాతుర్యము ఖండఖండముల జొహార్లంది వెల్గొందఁగన్.

"ఊర్ధ్వ పటము" ల యందు మహోజ్జ్వలముగ
నాట్య వేదము శిల్పించినారు చూవె!
బౌద్ధ జాతక కథల విస్పష్టముగను
నడిమి ఫలకమ్ములోఁ దిద్దినారు సుమ్ము.

చైత్యశిలా ఫలకంబుల
సత్యాద్భుత శిల్పరేఖ హావణించి మహా
చైత్యములఁ దిద్ది పెట్టిరి
చైత్య ప్రతికృతులనంగఁ జాలెడు రీతిన్.

అదిగో! బుద్ధుని ధర్మచక్ర మొక స్తంభాగ్రంబుపైఁ జెక్కఁబ
ట్టదిః లోకాద్భుత దివ్యశిల్పకళ నాట్యంబాడు నా కంబమం;
దదియే చాటు పురాంధ్రశిల్పి విజయాహంకార గాథావళుల్
గొద లేకుండ వచింపఁ, దద్యశము దిగ్వ్యూహంబుల న్నింపగన్.

అందుఁ జెక్కిన గుఱ్ఱాలయందుఁ దెల్గు
జోడు లొయ్యారముగను గూర్చుండి యాంధ్ర
నాగరికతను నీ నేల నాల్గుచెఱగు
లందు నింపంగఁ బోవుచున్నట్లు దోఁచు.

అపరబుద్ధుఁడనంగఁ బే రంది నట్టి
యార్యనాగార్జునుండు శిల్పాభిమాని
కల్పనము చేసె నంట ప్రాకారరేఖ
భువన సౌందర్య మిట నచ్చు పోసినట్లు!

వేద వేదాంత శాస్త్రాది విధుల నాత్మ
స్వత్వములు చేసికొన్న శిల్పప్రభుండు
తన కళాక్షేత్రమందు నధ్యాత్మసత్య
మర్మముల నెంత మెలఁకువ న్మలచినాఁడు!

"అయుకకంబము" ల్మలచునట్టి తెలుఁగు తెలుంగుశిల్పము
నే యుగపద్ధ దీ తెలుఁగుదేశపు శిల్పి స్వ సంప్రదాయముజ
బాయక సృష్టిహేతువులఁ బంచవిధాదిమ శక్తులజ జగత్
ధ్యేయులఁ బంచమూర్తులను దీరిచి చూపెను వీని రూపునజ.

ఆది మైకైక తత్వమునం దభిన్న
ములుగ నెలకొని భువనలీలల వెలార్చు
పంచశక్తుల నే మత పక్షమందు
నన్వయింపంగఁ జాల రధ్యాత్మవిదులు?

ధర్మచక్ర ప్రవర్తనాద్యంబు లైన
పంచ కల్యాణములను సూచించు వాంఛ
నైత మిచ్చిన యనాఁటి స్థపతి మనవికి
నార్యకస్తంభ నిర్మాణమునుఁ జూడు.

బుద్ధుఁడును, ధర్మమును, సంఘమును ననంగఁ
దనరుచున్న త్రిరత్నంబులకు త్రిశూల
చిహ్నమును జెక్కె యల పరశిల్పి బుద్ధు
నొక్క సూత్రముతో గ్రుచ్చె నోయి శిల్పి.

బుద్ధోదయమున కద్భుత చిహ్నములు గాఁగఁ
పద్మచిత్రమ్ములఁ బాదుకొల్పి
అద్వయవాది మహాభినిష్క్రమణంబు
తలఁపించు వారువమ్ములను మలచి
మారజయంబు నుదార బుద్ధత్వాప్తి
స్మరియింప బోధివృక్షములు చెక్కి
సౌగతధర్మ ప్రచారంబు సూచించు
ధర్మచక్రముల విస్తరము తీర్చి

ఆ మహాపరినిర్వాణ మాత్మ వెలయు
స్తూపరూప శతమ్ములఁ దెలిపి పెట్టి
శాక్యసింహుని జీవిత సార మెల్ల
వ్రాసినా రీ శిలామయ గ్రంథమందు.

కామకల్పిత సంసారకంథ దాఁటి
జీవితమ్మున బుద్ధత్వసిద్ధిఁ గాంచు
గెలుపునకు సూచకంబుగా మలచినారు
చైత్యమున రమ్యతర సింహ సముదయంబు.

హైందవశిల్పికిన్ సహజమౌ రసభావ మనోజ్ఞ చిత్రణం
బిందలి మూర్తులన్నిటి సమృద్ధి వహించెను; బాహిరాకృతుల్
చిందిన వందచందము లశేషజగంబులు నాంధ్రశిల్పి సం
క్రందను చాతురీమహిమ గాంచి యొనర్చు చిరప్రశంసలన్.

ఇవిగో! బుద్ధుని దివ్యపాదములు గంటే, శూల చక్రాది ల
క్ష్మవిలాసోజ్జ్వలముల్ దురంతభవ దుఃఖ ధ్వంసకంబుల్ సదా
భువనారాధ్యము లెట్లు శిల్పి ప్రతిభాపూర్వక్రియా సృష్టివై
భవచాతుర్యము రూపమెత్తినటులే భావించి కల్పించెనో!

గౌతముమునీంద్రు శ్రీపాద కమలముద్ర
లెచట హత్తిన నట జగ దీడ్యము లగు
స్వర్గములు సృష్టి కాలేదె జనతయందు ?
నిత్య నిర్వాణపథము రాజింపలేదె !

ఈ మహనీయపాదముల కెందఱు మ్రొక్కులు వెట్టి జన్మదో
షామయశూన్యులైరొ, మహిమాఢ్యము భూతదయావ్రతమ్మునే
భూములఁ బండఁజేసి యివి పుణ్యయుగమ్ముల సృష్టిచేసెనో
యేమరకుండ వీని మది నెంచి ఘటింపుఁ డనశ్వరాంజలుల్

దివ్యతమ శిల్పముల నిట్లు తీర్చి దిద్ది
ఆత్మనామంబు చెక్కకొనట్టి శిల్పు
లెంత వైరాగ్యపరులొ ! మఱెంత కీర్తి
కామనాదూరులో ! శివంకర ధిషణులో !!

ఆర్యకస్తంభాల యందచందములలో
లతలు పూవులు సింహతతులు చూచి
అందచిత్రముల దివ్యాకారములలోని
మూర్తుల యింపు సొంపులకుమెచ్చి

## స్తూప శ్రీ

ప్రాకారరేఖపై లోకాద్భుతపు శిల్ప
చాతుర్యమున కాత్మ సంతసించి
ఉష్ణీష శిల్పాల నొప్పు సముజ్వల
సౌందర్యమునకు నాశ్చర్య మంది
ఆ యధిష్ఠానచిత్రములందు నూర్ధ్వ
పటములందలి దివ్యశిల్పముల కుబ్బి
త్రిజగముల నేలఁజాలు మా తెలుఁగుశిల్పి
మహిత నిర్మాణ కళకు నమస్కరింతు.

నాకవిత చాలదోయి, సుందరము లయిన
నీ రచించిన శిల్పఖండికల నెన్న;
భావనావీథిఁ దలఁపులు ప్రాఁకులాడి
మాయమైపోవుఁ గడ కే సమాధియుందొ.

శాశ్వత కళాఘనంబు దేశమున కొసఁగి
అనుపమత్యాగ మొనరించి యరిగినట్టి
కీర్తిసన్న్యాసివగు నీదు కృతులు కతలు,
మానవాదర్శములు విశ్వమాన్యములును.

*

## వైభవము

బుద్ధదేవుని శ్రీపాదములకు నెరగి,
ఆర్యకస్తంభ శోభల నభినుతించి,
ధర్మచక్ర ప్రసిద్ధ సౌందర్య మెంచి,
వర్ణన మొనర్తు మన పురావైభవమ్ము.

ఈ మహదుర్గంబు నెటుల నిర్మించిరో
　　శాత్రవానీక దుస్సాధముగను
ఈ నృప ప్రాసాద మెటు సృష్టి చేసిరో
　　శిల్పదేవత దృఢాసీన గాఁగ
ఈ సౌధవిధముల నెట్లు కల్పించిరో
　　వాస్తుసంపద కాలుపట్లు గాఁగ
ఈ వీధివిన్యాస మెట్లు లూహించిరో
　　పురలక్ష్మి క్రొత్తసొంపులు వహింప

ఈ మనోజ్ఞాపణంబుల నెట్లు తీర్చి
కట్టిరో క్రొత్తచెలువము లుట్టిపడఁగ
ఈ పురోద్యానవాటుల నెట్లు తీర్పఁ
గల్గినారలో వింత సింగార మొలుక.

గోపుర ద్వార తోరణ కుడ్యతతుల
శిల్పవిన్యాసరీతు లచ్చెరువు గొల్ప
ధాన్యకటక పురీంద్ర సౌందర్య లక్ష్మి
విభ్రమ విలాసములఁ జెప్పు వే విధముల.

అటఁ బౌద్ధసన్న్యాసు లాదరించు ననాథ
　　బాలు రుండిన శరణాలయములు
అట హోమకుండాల కాహుతిఁ గాఁబోవు
　　పశువుల రక్షించు భవనసమితి
అటఁ ద్రిరత్నముల సంధ్యావేళ బోధించు
　　కారుణ్యనిధుల దీక్షాగృహములు
అట నహింసాధర్మ మాద్యంత మెఱిఁగింప
　　వెలయు నుపన్యాస వేదికలును

అచట నష్టాంగయోగంబు నభ్యసింపఁ
దీర్చి కట్టిన మహనీయ దివ్యశాల
లరసి యాంధ్రుల భోగభాగ్యముల కెడఁద
ముదముపడ నెంతొ పొంగిపోయెదము మేము.

ఒక తెలుఁగుఁజగమ్మున కటోయి, దిశాఖిల దేశదేశముల్
ప్రకటముగాఁగ గర్వపడు భంగిఁ జెలంగిన ధాన్యవాటిరాట్
శకము సమస్త శాంతి సుఖ సంపదలన్వెలయించి నూత్నజ
వికె వెలిగింపలేదె? నవ విశ్వము సృష్టి యొనర్చదే ధరణ్ ?

తన బౌద్ధగురుని మతవ్రత దీక్షగా
సింహళంబున స్తూపచిహ్న ముంచి
తన సర్వశిల్ప విద్యా నిదర్శనముగా
"దాపంగు" విశ్వవిద్యాలయ మిడి
తన యహింసకు మేలి తార్కాణగాఁ బ్రాణి
వితతికిఁ గారుణ్యభిక్ష పెట్టి
తన కళారాధన కెనలేని ఫలముగా
జగమెన్న స్తూపరాజంబు గట్టి

తనదు బౌద్ధధర్మ తత్పరతకును దృ
ష్టాంతములుగ మే ల్విహారములను
జెక్కి వెలయఁజేసి పేరుగన్న దమరా
వతి, మహోజ్వలాంధ్ర పత్తనంబు.

ఆపూట కింట బియ్యము లేని నిఱుపేద
కవులపైఁ గురిసె బంగారువాన
అతిలోక సృజనా కళారాధకుల చేయి
సృష్టించె శిల్ప విశిష్ట జగము
పరులగుండెలు తీయు బంట్లైన తెల్గు జో
దుల బాకులు దిగంతముల వెలిఁగె
కులభేదములను ముక్కలుగాఁగఁ జీలిన
మానవు లేకసమాజ మైరి
అధ్యులైన జనము లాదిగా వీధిలోఁ
బేద ప్రోవు చేయు పిల్లదాఁక
చదువు నీతి గలిగి చదురులై వెల్గిరా
బౌద్ధ భూమిపతుల పాలనమున.

పొట్టకుఁ గూడు, కట్టుటకుఁ బుట్టము గానని పేదవారు లే
నట్టి జగమ్ము నెట్లు సుగతాంధ్రులు సృష్టి యొనర్చినారలో!
యెట్టుల యీ చరాచరము లెల్ల సుఖింపఁగ బద్ధదీక్షులై
కట్టిరొ శాంతితోరణ లఖండ పరోపకృతి ప్రవీణులై!

ఇట శిలాశిల్పమే కాక యెల్ల కళలు
నాంధ్రనాగరికత వెలు లతిశయింప
వెల్లివిరిసిన వా పూర్వ వేళలందు
నాంధ్రశిల్పుల చాకచక్యంబుకతన.

పంచవిధ శిల్పముల దేశభాగ్యమునకు
సాధనముగా నొనర్చి యైశ్వర్యలక్ష్మి
సంతరించుట కానాఁటి స్థపతివరులు
వెదకకున్నట్టి దొక చిన్న వృత్తి లేదు!

ఆ కృష్ణాతటినీ తరంగముల నొయ్యారంబుగా నాడు మా
నౌకాశ్రేణులు తెల్గు వర్తకుల విన్నాణంబు సూచించెడిన్,
నైకాశ్చర్య మనోజ్ఞ వస్తు యుత నానా కర్మశాలావళుల్
మా కర్మారుల హస్తనైపుణిని దార్కాణించు వేరీతులన్.

అపుడు తే రాంధ్రత్వ మగ్గిఁ గాల్చి విదేశ
 రీతుల మెచ్చి వరించువార
లపుడు తే రాత్మార్థము లోకమును బలి
 గొనునట్టి నిష్ఠురక్రూరకర్ము
లపుడు తే రాత్మధర్మసేతులై యవి
 నీతితెర్వులఁ బయనించువార
లపుడు తే రాంధ్రవేషాదరము విడి
 పరుల పంచలు సేరి బ్రతుకువార

లపుడు తే రెన్ని చూచిన నంధ్రమందు
నాంధ్రజాతీయతా దూరులైన జనము
లప్పు డాంధ్రత్వ మగ్గలమై జగమ్ము
నేలినది సుమ్ము తనదాని కెదురులేక !

లోక కల్యాణ ఘటనా విలోలబుద్ధి
బుద్ధదేవునివలె త్యాగమును బూని
జీవితము సార్థకంబుగాఁ జేసికొన్న
జనము లగ్గల మా నాఁటి తెనుఁగుజగతి.

విశ్వహితంబు పొంటె నతివేల సుఖంబులు భోగభాగ్యముల్
నశ్వర జీవితంబులు తృణంబుగ త్యాగముచేసి సేవయే
శాశ్వత శాంతిమార్గమని సంతత భూతహితానుసారులై
యీశ్వరతృప్తికై బ్రతికి రీగిరి తెల్గులు బౌద్ధభూమిపై.

శాతవాహన ధరానేత శ్రీముఖుం డాత
డందు సామంతోపహారములను,
హాలుని గొలుచు గుణాఢ్యుండాతడు బృహ
త్కథ సృష్టిసేయు ప్రాగ్గాథ లేర్చి,
భావ వివేక తాపస గురుం డాతడ
ద్భుత వజ్రధారణి స్తుతి యొనర్చె,
తాంత్రిక బౌద్ధ విద్యా పారగులు వారు
జపియింతు రే మంత్ర సముదయంబొ

అదె మహాయాన బౌద్ధశాఖానుయాయు
లచట చర్చింత్రు హీనయానార్య సమితి
గలిసి బుద్ధుని తొంటి విజ్ఞానరీతు
లహహ! యివి యెంత చారుదృశ్యంబులోయి?

చెంగటగ నున్న దీవులఁ జెప్ప నేల ?
"అమెరికా" యందె మనశిల్ప ముడుగు వెట్టె ;
ఆసియా జ్యోతి వెల్గి లోకామృతముగ
మర్త్యజగమున చీఁకటిమాంద్య మణఁచె.

దక్షిణాపథమునకుఁ బ్రధాన బౌద్ధ
పీఠ మి యమరావతి విస్తరించె
నవని నెల్లెడ బౌద్ధ విహారములను
నద్భుతములగు శిల్ప విద్యాలయముల.

అపుడు గణనీయముగ దేశమంచు జరుగు
బౌద్ధసంగీతులం దాంధ్ర పండితాళి
వాదధోరణి బ్రతివాది వాయి కట్టి
గెలుపుగొన్న చరిత్రలు కలవఁటెన్నొ !

సింహళద్వీపమున మున్ను సృష్టిచేయు
స్థూపసందర్భమునకు భిక్షువ్రజంబు
నాల్గులక్షల "పైచిల్కు" నడచినార
లాంధ్రదేశమునుండి నాఁ డబ్బురముగ.

తెలుఁగువారపు డా మహాదేవభిక్షు
నాధిపత్యముతో నమరావధపురము
వాతవాడలఁ "గిటకిట" లాడఁ జూచి
పొరుగుదేశము లెంత మచ్చరము గొనెనొ !

అప్పుడు వీరి మూలమున నాంధ్రుల నాగరికత్వ సంపదల్
కుప్పలు గాఁగ సింహళములో దిగెనందురు ; తెల్గుశిల్పపుం
జొప్పులె కానుపించు నట స్తూపమునందున బుద్ధమూర్తిలోఁ ;
జెప్పెడిదేమి తెల్పుపస చేరెను రా ! చిఱు దీవులందునన్.

ఆపస్తంబ మహాతపస్వి నిగమవ్యాఖ్యా ప్రశస్తోను వి
ద్యాపాండిత్య మహాప్రగల్భుఁ డిటసూత్రగ్రంథముల్ వ్రాసితా
నాపాదించె ననంత కీర్తులు ,తెలింగైశ్వర్య సంధాత యై ;
యా పుణ్యర్షిచరిత్ర మాంధ్రులకుసంఖ్యా మంత్రపూతమ్ముగన్.

శా లి వా హ ను డు

ఇచ్చట శాలివాహన కవీంద్రుఁడు ప్రాకృతభాషలో కవుల్
మెచ్చెడు తీయతీయనగు మేలిమిగాథల నెడునూర్లు వా
క్రుచ్చి సరస్వతీ రుచిర రూపము తీర్చి దిద్దె నంట ; యా
సచ్చరితాగ్రగణ్యు నుతి సల్పరె, యాంధ్రులు నేఁటికేనియున్ !

ఆంధ్రుల సేవగా రస మహత్తర మంజుల కావ్యగాథ లి
ఖ్యాంధ్ర నృపుండు కూర్చుకొని ప్రాకృతవాణి మనోజ్ఞభావ సి
రంధ్రనొనర్చి యర్చలిడి రమ్య యశో నవ చంద్రకాంతిలో
నాంధ్రము ముంచియెత్తె బళిరా, పులకింపదె మేను సోదరా!

జుమ్మని తేఁటులు మూఁగెనొ?
గమ్మని వాగ్దేవి గజ్జె కదలించెనొ, మా
కుమ్మరిదొరగా రిమ్మహి
కమ్మని గాథామధూళిఁ గూర్చెడు వేళన్.

రెండు వేలేండ్లనాఁడె మా ఱేఁడు మధుర
మధుర నవ సాహితీ రుచు ల్మల్లడింప
విశ్వమోహన గాథలు వెలయఁజేసె
సన్నుకీరితి నీదెగా, యాంధ్రపుత్ర!

నూఁగుమీసాల ప్రాయమందున తలంపు
లుజ్వలములై గుబాళించుచున్నయపుడు
శాలివాహను నీ సప్తశతిని నొడివె
నాంధ్రమునయందు శ్రీనాథుఁ డద్భుతముగ.

ఈ కవిసార్వభౌముఁడు రసాంచితశైలిఁ దెలుంగు దిద్దగా
నా కృతిరత్న మాంధ్రుల మహాదురదృష్టము హేతువౌచు నా
త్మాకృతి గోలుపోయినదియా ? అది యుండిన శాలివాహన
శ్రీకవి సచ్చరిత్రమును జెప్పెడి దేమొ రవంతయేని యుక్తా !

శకము నిలఁబెట్టి మన యాంధ్రజాతి యశము
వసుధ నింపిన యొక చక్రవర్తి యతఁడు!
అతని మనసారఁ బూజించి యతనిమహిమఁ
గొలువఁ జాలని పటుకృతఘ్నులము మనము.

కుమ్మరివంగడమ్ము వెలుఁగుల్ వెలయింపఁగఁబుట్టి,యాంధ్రరా
జ్యమ్మున కేలికై మధురసాహితి మన్నన సేయు విజ్ఞుఁడై
కమ్మనిగాథ లల్లిన యఖండకళా రసమూర్తి కాంధ్ర దే
శమ్ము రచింపదే రస వశంవదమై రుచిరాక్ష రాంజలుల్ ?

సిద్ధనాగార్జునుఁడు

అతఁడు నాగార్జునాచార్యుఁ డతులశక్తి
సిద్ధులను గాంచి యోగవిశిష్టుఁ డగుచు
సిద్ధనాగార్జు నాఖ్య మించిన మనీషి
కద, మహాయాన బౌద్ధశాఖా ప్రణేత !

ఏ మహాతాపసోత్తంసుఁ డిరవుకొనుటఁ
గనెనొ "నాగార్జునునికొండ" యనెడు పేరు
శ్రీగిరీంద్ర; మతండు ప్రసిద్ధ శిల్ప
చాతురీధూర్వహుఁడు బౌద్ధచక్రవర్తి.

బుద్ధు గుణశీలముల నత్యపూర్వ్యఫణితి
మధురముగ వర్ణన మొనర్చి మాన్యుఁ డీతఁ
డంపినాఁడు "సుహృల్లేఖ" యనెడు పేర
నాంధ్రరాజగు సాతవాహనుని కడకు.

ఆ లేఖాంశము లెంతపూజ్యములో నాఁడాయాంధ్రరాజేంద్రుఁడు
ద్వేలానందము సందడింపఁగఁ దదాదేశంబు పూదండఁగా
మౌళిం దాలిచి బౌద్ధధర్మముల సన్మానించి బంగారపుం
బూలం బూజలుచేసె చైత్య మనిదంపూర్వాభిరామంబుగన్.

అతని పవిత్రసేవల కుదాహరణంబులు తెల్గుగడ్డపై
స్థితిఁ గనినట్టి చైత్యములు శిల్పవిచిత్రములుం గళాలయా
ద్భుత మహనీయసృష్టులు నపూర్వము లార్తత దర్శనంబులున్
జతుర వినూత్న వైద్యవిధ చర్యలు జీవనసౌఖ్య హేతువుల్.

అతని నాగార్జునునికొండ యభ్యుదయము
నాదిశంకర గురుమూర్తి యణచి వైచె
వికృత బౌద్ధము ఖండించివేసి వేద
ధర్మసంస్థాపనము సేయు తరుణమందు.

ఈ నాగార్జునభారతీయముని యే యే సత్కృతుల్ వ్రాసి వి
జ్ఞానంబుఁ వెదచల్లె లోకమున నా సద్గ్రంథముల్ శ్రీహరీ!
యేనాఁడో చనె నగ్నిసాత్కృతముగా నివ్వేళ నవ్వాని నే
చైనాయందొ తిబెత్తునందొ కని హర్షంబందరే హైందవుల్!

బౌద్ధమత సంస్కృతికి భక్తి స్వాగతంబు
పలుకుటంజేసి ప్రాకృత వాఙ్మయంబు
హైందవోదగ్ర కోపానలార్చి ప్రమగ్గి
స్వ స్వరూపముతోడఁ గన్పడదు నేఁడు.

### వి శ్వ వి ద్యా ల య ము

అదిగొ! పూర్వాంధ్ర విశ్వవిద్యాలయమ్ము;
శారదాదేవి రమ్య విహారశాల,
కళల కాణాచి, చదువులఁ గన్నతల్లి;
అరయు మొకపరి స్మృతినేత్ర మట్టె విప్పి.

ఈ కళాపరిషత్తు షు న్నెన్ని యెన్ని
దేశముల కాత్మవిద్యోపదేష్ట యగుచు
దెలుఁగు వెలుఁగులు దిక్కుల నిలిపినదియొ
అరసిరే యెన్నడైన మా యాంధ్రజనులు ?

ఇట గజ్జె గట్టి శారద
నటనము సల్పిన దఁటా దినంబులయం దు
త్కటమయి శిల్పశ్రీ వి
స్ఫుటకీర్తులు దెసల క్రమముగఁ బ్రాఁకె నఁటే !

ఆ కరుణాతపస్వి హృదయమ్ము ద్రవించి జగద్విముక్తి ల
క్ష్మకము లెట్టి శాస్త్రములు సృష్టము లైనవొ, వాని బౌద్ధవి
ద్యాకృతు లైనపండితు లహర్పతితేజు లుపన్యసించు నా
మా కమనీయ దృశ్యముల నాత్మ సుఖింపఁ జూడు నెచ్చెలి !

అదె విశ్వవిద్యాలయ ప్రవేశద్వార
మతిలోక శిల్పాల కాటపట్టు !
ఇదె పట్టభద్రుల కెలమిమై యోగ్యతా
పత్రమ్ము లందించు భవ్య భవన !

మదె శిష్యతతికి శాస్త్రార్థముల్ బోధించు
　　　　రకరకమ్ముల హర్మ్య రాజ రాజి!
అదిగో దేశాంతరాయాత విద్యార్థుల
　　　　వసతికౌ ఘనసౌధ వాటికలును
అవె మహోత్కృష్ట శిల్పకళాలయంబు!
లవ్వి కార్యాలయంబు, లియ్యది మనోజ్ఞ
ఘనతరాద్భుత పుస్తకాగార సమితి;
సర్వవస్తు ప్రదర్శన శాల లివ్వి!

అల "టిబెట్టు"న నిర్మితమై తనర్చు
నట్టి "దాపంగు" విశ్వవిద్యాలయంబు
దీని నాదర్శముగఁ గొని తీర్చి రంట?
యాంధ్రుల గురుత్వమునకు చిహ్నంబు గాఁగ!

ఎనిమిదివేల శిష్యు లిట నెప్పుడుఁ బాయక శాస్త్రముల్ కళల్
మనన మొనర్తురంట! మతిమంతులు గీష్పతులట్టి దేశికా
గ్రణులు శతాధికంబుగ నిరంతరచర్చలఁ బుచ్చువారఁటే!
ఘనులగు శిల్పులుం గవులు కమ్రకళార్చన సేయువారఁటే!

మఱల మా భారతీదేవి మధురమధుర
మంజు నూపుర నిక్వాణ మహిమ వినమొ!
ప్రాక్కళాయోగ విజయ గర్వము తెలుంగు
వీర సంతతి హృదయాల వెలయఁ గనమొ!

బు ద్ధ జ యం తి

ప్రతివసంతపు వైశాఖ పర్వములను
బుద్ధుని జయంతులందు సబ్బురము గదుర
వాడవాడలు కళకళలాడి పోవు
భవ్యదృశ్యమ్ము పొడగాంచు పాఠకుండ!

ఈ పవిత్రదినంబుననె ప్రభుండు
'ధర్మచక్రము నా' మృగదావమందు
త్రిప్పినాఁడటె యా పుణ్యదివస మెన్ని
పూజలకు నోచుకొనదు భూభువనమందు?

వారు చీనాదేశవాసులౌ భిక్షువుల్
పూజించుచున్నారు బుద్ధదేవు
వారలు సింహళప్రజలు వెల్గింతురు
దీపవితానముల్ స్తూపమందు

వారు త్రివిష్ట పావాస విద్యార్థులు
పఠియింతు రట "ధమ్మపదము" భక్తి
వారు జావాద్వీపవాసులు త్రిపిటక
ధర్మ నిర్మల చర్చc దవిలినారు
వా రఖండులు సు మ్మాంధ్ర బౌద్ధగురులు
పన్యసింతురు ప్రబల విపక్ష పక్ష
ఖండనోదగ్ర చాతురీగరిమ సుగత
వితత మతహిత నీతు లద్భుతము గదుర!

బుద్ధుని జీవితాంశములు పూసలు గ్రుచ్చినరీతిc జెప్ప సం
విద్ధనమైన యా "లలితవిస్తర" కావ్యము నాంధ్రపండితుల్
బుద్ధమతాభిమానులకు బోధ యొనర్చెద రందుc గాంచు మా
వృద్ధులు బాలు రంగనలు విందు రట "మ్నవధర్మ" పద్ధతుల్.

ఇదె కృష్ణానదిc గ్రుంకువెట్టి గముల్లై యే తెంచు నీ భిక్షువుల్
చదువంజొచ్చిరి బౌద్ధవేదముల ; నాచార్యా పరివ్రాజకల్
సుదతీలోకముc గూర్చి బుద్ధుని మహాసూక్తార్థము ల్విప్పి చె
ప్పెదు రీసుందరదృశ్యముల్ హృదయ మాపోవంగ భావింపుమా!

★

# వివాదము

అది సుధన్వ నృపాలు సభాంగణంబు
బౌద్ధ వైదిక మతసత్య భంగు లరయ
నుభయ మతములవారు మహోద్ధురు లయి
వాదములు సేయఁబూని రా ప్రభునిప్రోల.

వైదిక ధర్మమార్గ మనవద్యముగా భువి నిల్పి కీర్తి సం
స్థాపన సేయఁబుట్టిన కుమారిలభట్టుఁ డుదగ్ర వైఖరిన్
వాద మొనర్చె వైదికుల పక్షము గైకొని; బౌద్ధపండితుల్
మేదుర తర్కధోరణుల మించిరి బ్రాహ్మణ పండితావళిన్.

బహుదినము లట్లు వాదోపవాదములను
జలిపినను సత్య మేదియో తెలియ కునికి
"ఆగమము లప్రమాణము లైనఁ జత్తు,
నవి ప్రమాణంబులేని యే హానిఁ జెంద".

అని యొక పర్వతాగ్రమునయందునుండి కుమారిలుండు దు-
కన సశుమాత్ర మెగ్గతనికిన్ బొడమూపదు; సభ్యులెల్లరున్
జనపతి గూడ మెచ్చి రది: జైనులు మాత్రము మంత్రసిద్ధిచే
మనుజుల ప్రభావమౌనొ యనుమానము మాకని మెప్పుకుండిరన్.

అవనినాథుఁడు బౌద్ధు ల నాగ్రహించి
"చివరి కొక్క పరీక్ష నేఁ జేయువాఁడ,
గెలుచువారల మతమర్వి వెలయు నింక
నోడిపోయిన మూర్ఖుల నుత్తరింతు".

అనుచు శపథ మొనర్చి ఘటాంతరమున
చిలువ నొకదాని నుంచి వాసెన బిగించి
"తెలియఁజెప్పుఁడు మీ బుద్ధిబలము మీ ఘఁ
గుండలో నున్న వస్తువుఁ గొదుక" కనిన.

విప్రవర్యులు తే పటివేళఁ జెప్ప
ననుమతింపుఁ డటంచు రాజాజ్ఞఁ బొంది,
అంత వణువాత భాస్కరోపాస్తివలన
బౌద్ధులను గెల్చు తంత్రము పడసి రంట.

బౌద్ధులు కుండలోపలిడి పాముని పల్కఁ గుమారిలాదు లు
ద్ధతి భోగితల్పుఁడు పయోజదళాక్షుఁ డటంచుఁ బల్కిరా
పద్ధతి సత్యమాయె నల భాస్కరదేవు ననుగ్రహంబుచే
సిద్ధత శ్రౌతధర్మము మహీశ్వరునాదృతి చూఱలాడఁగన్.

ఘటములో నిద్ధ దందశూకంబుమీఁద
శ్రీరమాభర్త గొలువున్న చెలువుగాంచి
బౌద్ధవిజ్ఞానము నెడందఁ బ్రస్తుతించి
బ్రాహ్మణుల వింతమహిమ కబ్బపడె నృపుఁడు.

తన యొనరించినట్టి శపథంబు వృథా చనరామి బౌద్ధులన్
జనపతి చంపఁజేసెను దృషన్మయ యంత్ర నిపాతి తాంగులన్
బొనరిచి! తేని యానతి మనోరథముల్ ఫలియింప బౌద్ధ నా
శనమున కుబ్బి శ్రౌత మత సంపద నించిరి విప్రు లెల్లెడన్.

ఇట్టి మతవిప్లవాగ్ను లెన్నెన్ని రగిలి
బౌద్ధమును దేశమున బూది పాలొనర్చె
నో, చరిత్ర యెఱుంగు మహోగ్ర మూర్తి
కాలపూరుషుఁ డెఱుఁగు వే యేల ? వినుఁడి.

ఒక్కతఱి దిక్కులొఱసి సముజ్జ్వలించు
బౌద్ధుల విహారవాటి యిప్పటిదెలము;
ఒక్కతఱి సొంపుచెడి గుండె వ్రక్కలించు
శవ నివాసోగ్ర భయద శ్మశానవాటి

ఇచ్చోట తొంటి యాంధ్రేశ్వరు ల్వసియించు
సింహాసనములు విచ్ఛిన్నములుగ
ఇచ్చోట తెలుఁగు శిల్పిశాను లసృజించు
దివ్యశిల్పములు విదీర్ణములుగ
ఇచ్చోట నాంధ్ర పూర్ణేందు నిభాస్యల
వింత చెల్వములు దుఃఖాంతములుగ
ఇచ్చోట తెలుఁగుల యిద్ధనాగరికతా
ముద్రాంకములు వినిర్మూలములుగ

ఇచట బౌద్ధమునీంద్ర మహిష్ఠధర్మ
బోధ లన్నియు గాలి కబుర్లు గాఁగ
శాపమిడి మా తెలుంగుల సంపదలను
లయ మొనర్చితివేమి వేళాతపస్వి?

అది యహింసాదేవు నాకారమా! గండ్ర
గొడ్డళ్ల బగులంగఁ గొట్టినారు,
అవి బౌద్ధకథలు రూపందిన మూర్తులా!
చెవులు ముక్కులు చెక్కి చెఱచినారు,
అవి బౌద్ధయతుల విహారమందిరములా!
నేలమట్టము చేసి నిలిపినారు,
అవి సౌగతుల పుస్తకాలయశ్రేణులా!
కాల్చి బూడిద నేటఁ గలిపినారు,
అవ్వి వికలాంగులై యేడ్చు ననదవాంధ్ర
శరణములె! అక్కటా! నుగ్గు సలిపినారు,
అవి "ముసాఫరుఖానాలె!" అగడమున
"పాయిఖానాలు"గా మార్చి వాడినారు.

ఏ క్రూరకాలాన నిట బౌద్ధ వైదిక
మతములు పేర్చి సమ్మర్దపడెనొ,
ఏ దుర్ముహూర్తాన నిట మతద్వేషమ్ము
పాలించెనో రక్తవాహినులను,

ఏ దుష్టరోజులం దీ సుందరస్తూప
    మగలించిరో మారణాయుధముల,
ఏ పాడుప్రొద్దులం దీ రాజధానిచే
    అగ్నిహోత్రుఁడు క్షుత్తు వార్చుకొనెనో,
ఏ విషమవేళయందున నిచ్చ టాంధ్ర
రాజరాజ కిరీట చిరత్న రత్న
సంతతులు నేల రాలె నా సమయ మెన్న
దారుణక్రూర యమరాజ దంష్ట్రయేమొ.

ఇచ్చట బౌద్ధజాతి నణికించిరటే మును, సూదు లక్షులం
గ్రుచ్చిరటే, శిశూత్కరము కొంకక కుత్తుక లొత్తినారటే,
చిచ్చునఁ గాల్చి చంపిరటె చేడియలన్న తలంపు లేకయే,
పిచ్చిమతాభిమాన మెదఁ బేర్చుటచే మన వైదికోత్తముల్.

ఈ రమణీయశిల్పముల నిట్టుల ముక్కలు చేసి యీసు చ
ల్లారఁగ నిండ్లమెట్లుగ, గృహావరణమ్ములఁగాళ్లఁ జాలుగాఁ,
పేరిచిరా? కటా! యెడఁద భిన్నమగుంగద బౌద్ధసత్కళా
పూరణకార్యముల్దలఁచుమాత్రఁ గఠోర శిలాళి కేనియుఁ.

బౌద్ధ మతచిహ్న మన్న దే పాటియున్న
పాడుపాడి యొనర్చి కృష్ణమ్మ కడుపులోనఁ
బాఱవేయక నిద్దుర పట్టలేదు
నాఁటి సౌగత ధర్మ వినాశకులకు.

మతము బౌద్ధమ యైన సంపదలు తెల్గు
దేశజననివి కావొ, తదీయ సుతులు
సోదరులు కారొ, భేదమ్ము పాదుకొల్పి
తల్లికడుపున చిచ్చిడం దగునటోయి !

హైందవ మతానుచరుల దౌష్ట్యమ్ము కతన
చితికి పోయిన బౌద్ధుల శిల్పలక్ష్మి
ముసలిమానుల దుండగమ్ములకు లోఁగి
నామ మాత్రావశేషమైనది గదన్న !

ఈ శిలాభోగమహిమ జీర్ణించి చెదఱి,
ఈ కళావైభవమ్ము నశించిపోయి,
ఈ నగరభాగ్యరమ తిరోధానమంది,
యేల మిగిలెనొ నేడు దీపాలదిన్నె ?

చెదలచే జీర్ణించి కూలి నశింప మిగిలి
రూపు గోల్పడసట్టి యీ స్తూపకృతులు
ఉన్న వొకకొన్ని పుణ్యాసు యున్యాజి సుమున
కళల కెద మెచ్చు ప్రభువుల చలువకలమి.

కృష్ణాతరంగ సంగీత విభ్రమములో
వినుపింపవే యాంధ్ర విభుల చరిత?
జీర్ణించియున్న యీ చిన్ని రెండూళ్ళలో
పాటము దేమి ధాన్యకటక మహిమ?
ఏపారియున్న యీ చివాలదిన్నెలో
దరిసెనం బీతేమి ధర్మరాజు?
పూర్వాంధ్రలక్ష్మి వేబూచులాడిన విట
కులుకవేమి నేండు తెలుగుసిరులు?
మతవిరోధుల ఘోర కర్మములకతన
కాలపురుషుని పటు దుర్గ్రహమువలన
పాడుపడిపోయె నా నాంటి బౌద్ధమహిమ;
అస్తమించిన దానాంటి యాంధ్రభూతి.

గౌతమీసుత శాతకర్ణి ప్రతాపంబు
కసి మసంగదు శత్రుగణము నేఁడు
పులమావి వాసిష్ఠిపుత్రు బాహాశక్తి
వహియింప దాంధ్ర భూభరము నేఁడు
శాలివాహన కవి చక్రవర్తి కవిత్వ
రసము లూరవు తెల్గువసుధ నేఁడు
ఆ మహాదేవ బౌద్ధాచార్య మతబోధ
విస్తరిల్లదు తెల్గువీట నేఁడు
సిద్ధ నాగార్జు నాచార్య శిల్పి వర్యు
శిల్ప వైద్యక యోగాది సిద్ధులన్ని
వెలయ వీ నాఁడు బౌద్ధవిద్వేషవహ్ని
ప్రబలుటంజేసి యాంధ్ర ప్రపంచమందు.

ధాన్యకటకపురీ సభ్యతా విభూతి
కడుపులో జీర్ణమగుడు నాఁకటికి డస్సి
విలపన మొనర్చు నీ కృష్ణవేణి యిపుడు
తొంటి పస చెడ్డ సోదరాంధ్రులను గలసి.

బుద్ధుఁ డమరేశ్వరుం డెట్టి పొరపు లేక
యైకమత్యము సుఖశాంతు లావహిల్ల
జనము లొనరించు పూజ లందిన దినాలు
కలవఁటే కొన్ని ! సుమధుర క్షణము లవ్వి.

అప్పుడు బౌద్ధ హైందవజనావళి చేతులు గల్పి శాంతిలో
దెప్పలదోఁగి సభ్యుల నుతు ల్గొని దేశవివృద్ధికొసమై
యుప్పన చేసినారఁట నిజాఖిలసంపదలన్ దృఢంబుగాఁ;
జెప్పెడు నాటివైభవము చిత్తమెలర్పఁగ శాసనాంకముల్.

* * *

అది బౌద్ధప్రళయమ్ముగా జనులు వ్యాఖ్యానించుచున్నారు, నే
నది శిల్పప్రళయమ్ముగాఁ దలఁతు, సత్యం బిద్ది; కాదేని నె
మ్మది కానందముఁగూర్చు శిల్పకృతు లమ్మాడ్కిన్ పృథాపుత్తురా?
యెద నూహింపుఁడు బౌద్ధవైరము కళల్ హింసింపఁ జల్లారునే?

మతవిద్వేషపిశాచ మావహిలి దుర్మానంబు పాటించి యే
వెతలం బెట్టిన బౌద్ధజాతిని, కళావిధ్వంసకుల్ గానిచో
శ్రుతివాదు ల్మనయాంధ్రసంస్కృతికి మెచ్చుంగూర్పరే యేటికి
గతి విద్వజ్జన గర్హ్యకార్యములు శంకాదూరులై చేయుటల్ ?

మతవైరమ్ము లోకస్థ కాలవశతఁ బాటిల్లెఁగాకైన ను
ద్ధతులై జాతిక జీవగర్భములగు గ్రంథశ్రేణులన్ శిల్పస
త్కృతులన్నాశమొనర్తురా? జనములన్ హింసింతురా? యిట్టిదు
ష్కృతముల్ రూపఱ దేశ మెల్లెడ సుఖ శ్రీ శాంతులొలాసెడిన్.

అమరేశ్వరాలయము

ఈ యమరేశ్వరాలయ మదే సుముహూర్తమునం బ్రతిష్ఠితం
బై యెసలారెనో యెఱుఁగ, మప్పటినుండియు నాంధ్ర ధారుణీ
నాయక గౌర వాదృతు లనారత మందుచు నీ ధరా ప్రజా
ధ్యేయుత భక్తకోటి కొక దివ్య మహాస్థల మై చెలంగెడున్.

ఆ కోటకేత రాజాగ్రణి గైసేయు
  శిల్ప నిర్మితిఁ గళా శ్రీ గడించి
అల కొండవీటి ధరాధినేతల మేలి
  సేవలలోఁ గ్రొత్త చెలువ మొలికి
శ్రీ కృష్ణరాయ ధరిత్రీధవుని చేతి
  యుపరంజి పూల సమర్చ లంది
మా వాసిరెడ్డి క్షమానాయకుని పున
  ర్నిర్మాణ కళల వన్నియలు గ్రక్కి

తెలుఁగుదేశమునందు వర్ధిల్లినట్టి
అంచితం బగు నారామ పంచకమున
నొకటిగాఁ బేరు గాంచె సుప్రకటమైన
శ్రీసు ధమరేశ్వ రాలయ క్షేత్ర మవని.

అది యొకప్పుడు బౌద్ధ దేవాలయ మఁట
ఇప్పు డమరేశ్వరస్వామి కిరవు సూవె;
అగపడుచు నుండు బౌద్ధ చిహ్నములు గుడిని
వెదకి చూడ పురాతత్త్వ విదుల కిపుడు.

* * *

ఓ యమరేశ, తావక మహోగ్ర లయోద్ధుర తాండవంబులో
నీ యమరావతీ విభవ మెల్లఁ బరాహతిఁ బాడొనర్చితే?
మాయ మొనర్చితే? భువనమాన్య మహాంధ్ర కళేందిరా పద
చ్ఛాయలు సైత మే యఘము సల్పిరి మా తెలుఁగుల్ జగత్ప్రభూ!

కరుణా సాంద్రుఁడవే నీవు, బుద్ధగురుఁడుం గారుణ్య పాథోధి; మీ
పరమస్నేహము తెల్గుదేశమున కాపాదించె నైశ్వర్యముల్;
మఱల న్నేఁడు పురాణ వైభవ కళాలక్ష్మీ విలాసోన్నతుల్
మెఱయింపంగయి కల్పుఁడయ్యయనుస్వామీ మానమస్కారముల్.

*

# వివరణములు

పుటలు.

35. విశ్వకర్మ, మయుఁడు, త్వష్ట, మనువు - వైదిక పౌరాణిక వాఙ్మయములలో ప్రసిద్ధిగన్న శిల్పప్రవర్తకులగు ఋషులు, బ్రహ్మలు.

41. పంచవిధాదిమశక్తులు : ఆదిశక్తి, పరాశక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి.

పంచమూర్తులు : బ్రహ్మ, విష్ణు, రుద్రేం, ద్రా, దిత్యులు.

పై రెంటికి సంబంధించిన విశేషాంశములు నా "శిల్పదర్శనము"న శిల్పబ్రహ్మలు, అను నధ్యాయములో జూచునది.

42. పంచ కల్యాణములు : బుద్ధావతారము, మహాభినిష్క్రమణము, మార ప్రధ్వంసనము — సంబోధి, ధర్మచక్ర ప్రవర్తనము, మహా పరినిర్వాణము.

55. శాలివాహనుఁడు కుంభకార కులమువాడను లోకప్రసిద్ధి యనుసరింపఁబడినది.

58. నాగార్జునని కొండకు శ్రీగిరి యనియు చారిత్రక ప్రసిద్ధిగలదు.

63. మహాయానబౌద్ధులు పవిత్రములుగా భావించు "నవధర్మముల"ను బౌద్ధ గ్రంథములు — ౧ గండవ్యూహము, ౨ అష్టసాహస్రిక, ౩ ప్రజ్ఞాపారమిత, ౪ దశభూమీశ్వర, ౫ సమాధిరాజ, ౬ లంకావతార, ౭ సద్ధర్మపుండరీక, ౮ లలితవిస్తర, ౯ సువర్ణప్రభాసములు.

64. సుధన్వమహారాజు సభలో కుమారిలభట్టు బౌద్ధులనోడించి నటికించెనన్న గాథ సంస్కృతములోని "శంకరవిజయము"నుండి గ్రహింపఁబడినది.

75. ఆరామపంచకము : అమరారామము, క్షీరారామము, దాక్షారామము, భీమారామము, కుమారారామము.

వైదికులు : వేదమతానుసారులగు హైందవులు.

పంచార్షేయులు : విశ్వబ్రాహ్మణులు.